# మతతత్త్వబోధిని

## రెండవ పుస్తకము

*By*
Fr. LAZAR, C. D., B. A., L. T.,






Translated and adapted
*By*
JOSEPH THAZHATH.

# పీ ఠి క.



"చిన్న వారలను నాయొద్దకు రానిండు. ఏలనగా మోక్షరాజ్యము అట్టివారలదే"

చూచితిరా జేసునాథస్వామికి చిన్నబిడ్డలపైగల ప్రేమ. రక్షకుని ప్రేమకు పాత్రులైన చిన్న బిడ్డలకు, జేసునాథుని గూర్చియు, పరలోక పితను గూర్చియు, మోక్షరాజ్యమును గూర్చియు, కావలసిన జ్ఞానము చనుబాలతో బోధింప వలయును.

చిట్టిపాపలు మనోవికాసములేని వారలును, చదువుటకును, వ్రాయుటకును తెలియనివారును గనుక, అధ్యయనము శ్రమకరము. మరియు క్రైస్తవ మతతత్వములలో అనేకములు మహాజ్ఞానులకుగూడ గ్రహించుటకు కష్టము. అందువలన అధ్యయనమునందు మిక్కిలి లలితరీతిని గైకొననియెడల మన శ్రమ విఫలమై పోవచ్చును.

పై సంగతులను ప్రత్యేకముగ గమనించి, మతతత్వ భోధిని యొుదలి ఈ మూడు పుస్తకములు రచింపబడినవి ఎందుకన ఈ మూడు పుస్తకములును కేవలము చిన్న బిడ్డలైన వారి కొరకు వ్రాయబడినవి. మొదలి యితి వృత్త ములన జపములును, వేదాగమము నుండియు తిరుసభ

చరిత్రము నుండియు గైకొనబడిన కొన్ని విషయములునై యున్నవి.

ఒక్కొక్క జపము వివిధ ఘట్టములుగ భాగింపబడ యున్నది. వాటిలో కంఠపాఠము అని వ్రాయబడిన విషయములు మాత్రము అధ్యాపకులు బాలురచే కంఠస్థము చేయింపవలయును. తక్కిన భాగములు బాలబాలికలకు వేద విషయముల పరిచయము చేయుటకై యుద్దేశింపబడినవి. అందువలన అధ్యాపకులు ఈ విషయము లన్నియు పిల్లలకు ముచ్చటగా బోధించి వల్లెవేయించుటద్వారా వారి హృదయములందు లోతుగా నాటుకొనునట్లు చేయవలయును.

పసిబిడ్డల స్వభావమునకు అనుగుణమైన నూతన విధానము ననుసరించి ఈ చిన్న పుస్తకములు రచింపబడినవి. మన యుద్దేశము నెరవేరవలయునన్న అధ్యయనము నందును కొన్ని నూతన విధానముల గ్రహింపవలయును. అందు కనుగుణమైన కొన్ని బోధనా విధానములను దిగువ వివరించెదము.

1. బాలబాలికలకు విసుగెత్తునట్లు యెక్కువ కాలము బోధింపరాదు.

2. జపములయొక్క ఒక్కొక్క భాగము రెండు పర్యాయములు బోధింపవలయును. ఒక్కొక్క విషయము పూర్తియైనంతనే వల్లెవేయించవలయును.

3. ప్రశ్నలు ఒక్కొక్కరిని ప్రత్యేకముగా అడుగక కొన్ని భాగములనుచేసి ఉమ్మడిగా ప్రశ్నింపవలయును. ఇట్లు ఉమ్మడిగా ప్రశ్నించినయెడల బాలబాలికల నుండియే మనకు జవాబులు లభింపగలవు. ఉమ్మడిగా చెప్పుటవలన అందరు ధైర్యముతో జవాబొసంగెదరు. ప్రత్యేకముగా ఒక్కొక్కరిని ప్రశ్నించినయెడల సిగ్గుచేతనో, లేక భయమువలననో సరిగా జవాబు చెప్పజాలక క్లాసుకు రాకపోవచ్చును.

ప్రశ్నలు అని చెప్పినచోట అంతకు మునుపు జరిగిన పాఠమునకు సంబంధించిన ప్రశ్నలడుగవలయునని భావము. అధ్యాపకులు ముందుగా సిద్ధపడి బోధన మనోహరముగా యుండుటకు ప్రయాసపడవలయును. ఇట్లు సిద్ధపడి బోధించిన పక్షమున మన చిన్న సోదర సోదరీలకు మత పఠనము సులభముగను, ఆనందప్రదముగను యుండుననుటకు సందేహము లేదు. ఈ మహాభాగ్యము మన బాలబాలికలకు లభించునట్లు జేసునాథస్వామియు మన తల్లియైన కన్యమరియమ్మయు ఆశీర్వదించుదురుగాక.

ఫాదర్ లాజర్.





# మత తత్వ బోధిని.

## రెండవ పుస్తకము.

—:o:—

ఈ చిన్నపుస్తకము పాపసంకీర్తనమునకు బిడ్డలను తయారుచేయు ఉద్దేశముతో వ్రాయబడియున్నది. అందువలన ఈ దేవద్రవ్యానుమానము పొందుటకు అత్యవసరముగా తెలిసికొనవలసిన జపములును, తదితర విషయములును యిందు వివరింపబడినవి. క్రొత్త సత్ప్రసాదము లోకొనుటకు పూర్వము రెండు మూడు పర్యాయములైనను, పాపసంకీర్తనము చేయుట మంచిది. ఇట్లు చేయుట వలన బాగుగా పాపసంకీర్తనము చేసెడి యలవాటు దివ్య సత్ప్రసాదము లోకొనుటకు పూర్వమే వారికి కలుగును.

ఇందు వివరింపబడిన సంఘటనలన్నియు ఏదో యొక విధముగా పాపసంకీర్తనముతో సంబంధించి యున్నవి.

అధ్యయనరీతినిగూర్చి పీఠిక నొకపరి చదువుట మంచిది.



# విషయసూచిక.



## పరితాప బాష్పములు.

# మతతత్వబోధిని.

## మొదటి భాగము.

### జపములు.

### 1. సర్వేశ్వరుని ఆజ్ఞలు.

తొలిపలుకు:— మనకర్త జేసునాధస్వామియొక్క జననమునకు సుమారు 1500 సం॥ లకు ముందు ఇజ్రాయేల్ జనము ఫారాయుని దాసత్వములో కష్టపడుచుండెను. తమ్ము రక్షింపవలయునని వారు హృదయపూర్వకముగా దేవుని ప్రార్థించుచుండిరి. సర్వేశ్వరుడు వారలమనవి నాలకించి, వారికి సహాయము చేయుటకై మోయిాజుని పంపిరి. మోయిాజుడు చాలా అద్భుతములు చేసెను. సర్వేశ్వరుని జనమగు ఇజ్రాయేలులను వారి నిర్భాగ్యదశనుండి రక్షించెను. ఎర్రసముద్రము దాటిన తర్వాత ఆమహాత్ముడు వారలను కానాను దేశమునకు దోడ్కొని పోవుచుండెను. మార్గమధ్యమున వారు సీనాయి పర్వతము దగ్గర గుడారములు వేసిరి.

అప్పుడు మోయిాజుడు సర్వేశ్వరుని ఆజ్ఞప్రకారము పర్వతమెక్కెను. జనము పర్వతము దగ్గరకు రాకూడదని ఆజ్ఞాపించెను. అప్పుడు పర్వతముపై భయంకరమైన ఉరుములు ఉఱిమి మెఱుపులు మెరసెను. ఉరుముల శబ్దమునకు పర్వతమంతయు వణకుచుండెను. అంతేగాక పర్వతమంతయు మండుచున్నట్లుండెను. ఇది గాంచిన ప్రజలు భయముచే వణకసాగిరి.

ఈ మెఱుపుల మధ్యమున సర్వేశ్వరుడు మోయీజున కగుపడి పదియాజ్ఞలు ప్రసంగించ దొడగెను. తర్వాత అవి రెండు రాతిపలకలమీద వ్రాసి మోయీజునకిచ్చిరి. ఆమహాత్ముడు వాటిని చాలభయభక్తితో స్వీకరించి, సర్వేశ్వరునకు స్తోత్రము చెల్లించెను. ఇట్లు మనకు సర్వేశ్వరుని పది యాజ్ఞలు లభించినవి.

ఆజ్ఞలు ఇచ్చిన సమయమున అతిభయంకరమైన ఉఱుములు ఉఱిమి మెఱుపులు మెరయుట సర్వేశ్వరుని చిత్తమైనది అదియెందుకని తెలియునా? మనము సర్వేశ్వరుని యాజ్ఞలకు లోబడకయుండినయెడల అతికఠినముగా శిక్షింపబడుదుమని మనకు తెలియజేయుటకే.

ఈఆజ్ఞలు ఇచ్చిన వారెవరు? ఎక్కడ? ఎవరి ద్వారా యిచ్చిరి? ఈ ఆజ్ఞలిచ్చినప్పుడు యేమిజరిగెను? ఈ విషయము నుండి మనమేమి గ్రహింపవలయును?

కంఠపాఠము.

1. సర్వేశ్వరుని మాత్రము ఆరాధించుదువుగాక.
2. సర్వేశ్వరుని నామము వ్యర్థముగా పలుకకయుందువుగాక.
3. సర్వేశ్వరుని పండుగ దినములను పరిశుద్ధపఱచుదువుగాక.
4. తల్లిదండ్రాదులను గౌరవించుదువుగాక.
5. నరహత్య చేయక యుందువుగాక.
6. మోహపాపములను చేయకయుందువుగాక.
7. దొంగలింపక యుందువుగాక.
8. అబద్ధసాక్ష్యము పలుకకయుందువుగాక.

9. మోహ తలంపులను తలంపక యుందువుగాక.
10 పరుల సొమ్ములను ఆశింపక యుందువుగాక.

ఈ పది ఆజ్ఞలు రెండు ఆజ్ఞలలో అణగియున్నవి.

1. సకల వస్తువుల కంటె సర్వేశ్వరుని అధికముగా ప్రేమించుదువుగాక.

2. నీవలె సమస్త జనులను ప్రేమించుదువుగాక.

సూచన:— సృష్టికర్త యైన సర్వేశ్వరునితోను, మన యిరుగు పొరుగు వారలతోను, మనకు కొన్ని బాధ్యతలు గలవు. ఆ బాధ్యతల సంక్షేపమే సర్వేశ్వరుని పదియాజ్ఞలు. వాటిలో మొదటి మూడు ఆజ్ఞలు సర్వేశ్వరునికి సంబంధించినవి. వెనుకటి యేడాజ్ఞలు పొరుగువారలకు సంబంధించినవి. సర్వేశ్వరునికి సంబంధించిన ఆజ్ఞలు చెప్పుడు? పొరుగువారలకు సంబధించిన ఆజ్ఞలు చెప్పుడు?

## వ్యాఖ్యానము.

మొదటి ఆజ్ఞ:—మొదటి ఆజ్ఞ ఏది? మనము చూచు ఈ ప్రపంచమును యెవరు సృష్టించిరి? సర్వేశ్వరుడు. మనలను యెవరు సృష్టించిరి? సర్వేశ్వరుడు. అందువలన దేవుడే మనకర్త. మనకర్తయైన సర్వేశ్వరుని మనము ఆరాధింప వలయునా? ఆరాధింప వలయును. ఇతర వస్తువులను సర్వేశ్వరుడుగా భావించి ఆరాధింప వచ్చునా? ఎంతమాత్రము ఆరాధింప కూడదు. అట్లు సేయుటయే విగ్రహారాధన. విగ్రహారాధన సర్వేశ్వరునికి చాల అయిష్టము ఒకప్పుడు ఇజ్రాయేల్ జనము ఒకదూడ నారాధించిరి. దానికి శిక్షగా

సర్వేశ్వరుడు 23 వేలమందిని శిక్షించిరి.

సర్వేశ్వరుడు సర్వజ్ఞుడు. వారికి తెలియని సంగతులు కలవా? ఏమియు లేవు. దేవుడు సత్యస్వరూపి. సత్యము చెప్పువారలను మనము విశ్వసించుచున్నాముకదా? విశ్వసించుచున్నాము. అట్లయిన సత్యస్వరూపియగు సర్వేశ్వరుని మనము విశ్వసించవలదా? విశ్వసింపవలయును. సర్వేశ్వరుడు సర్వసంపన్నుడను, సకల మేలుల స్వరూపియునై యున్నాడు. మనకు మేలుచేయుటకు సర్వేశ్వరునికి ఇష్టము కలదా? మనము అడిగిన చాలును. మనకు అన్నియు దయచేయుదురు. ఇటువంటి సర్వేశ్వరుని మీద మనము నమ్మిక యుంచవలదా? నమ్మిక యుంచవలయును. సర్వేశ్వరుడు మనలను ప్రేమించుచున్నారా? ప్రేమించుచున్నారు. అందువలన మనము సర్వేశ్వరుని ప్రేమింపవలదా? ప్రేమింపవలయును. సర్వేశ్వరుని ఆజ్ఞమీరుటయే పాపము. మనము మన తల్లిదండ్రుల మాట వినకున్న వారికి దుఃఖము కలుగును కదా? అవును దుఃఖము కలుగును. అందువలన పాపము చేసినట్లయిన వెంటనే సర్వేశ్వరుని మన్నింపు అడగవలయును. వీటినన్నిటిని మొదటి యాజ్ఞ మనకు ఆజ్ఞాపించుచున్నది.

## —* రెండవ ఆజ్ఞ. *—

రెండవ ఆజ్ఞ ఏది? రాజులను మనము గౌరవించుచున్నాముకదా? గౌరవించుచున్నాము. వారలను అగౌరవముగా మాట్లాడవచ్చునా? మాట్లాడకూడదు. దేవుడు రాజులకు రాజైయున్నాడు. కాబట్టి వారిని గౌరవహీనముగా

మాట్లాడకూడదు. దేవదూషణము పలుకువారలను రాళ్లు వేసి చంపవలయునని, సర్వేశ్వరుడు మోషేకు ఆజ్ఞ యిచ్చియుండిరి. అర్చ్యశిష్టులను, పవిత్రవస్తువులను గూర్చి మాట్లాడునపుడు గౌరవముతో మాట్లాడవలయుననికూడ ఈ ఆజ్ఞ మనకు నేర్పుచున్నది. తిరస్కారముగను, అనాదరముగను అర్చ్యశిష్టులను గురించి మాట్లాడుట సర్వేశ్వరునికి ఇష్టమగునా? ఇష్టముకాదు. అశ్లీ తిట్టుట, దూషించుట, శపించుట మొదలగువాటిని ఈ ఆజ్ఞ నిషేధించుచున్నది.

—* మూ డ వ ఆ జ్ఞ. *—

మూడవ ఆజ్ఞ ఏది? పాతనిబంధనలో జూదులు శనివారమును పవిత్రముగా ఆచరించుచుండిరి. ఐతే ఆదివారము మనకు ఒక గొప్పదినము. ఆదినమున రెండు గొప్ప కార్యములు జరిగినవి. (1) మనకర్త పునరుత్థానమైన దినమేది? ఆదివారము. (2) ఏదినము స్పిరితు సాంక్తువైన సర్వేశ్వరుడు అపోస్తులమీద వేంచేసి వారల విశ్వాసము దృఢపరచెను? ఆదివారము. అందువలన శనివారమునకు బదులు ఆదివారమును మనము పవిత్రముగా ఆచరించుచున్నాము. అట్లేవిధముగా తిరుసభ యేర్పాటుచేసిన యితర పండుగలను గూడ మనము పవిత్రముగ ఆచరింపవలయును.

—* నా లు గ వ ఆ జ్ఞ. *—

మనలను సృష్టించినవారెవరు? సర్వేశ్వరుడు. జీవము నిచ్చిన సర్వేశ్వరునకే గాక మనమింకా నెవరికి అప్పుపడి యున్నాము? మనతల్లిదండ్రులకు. వారు మనకొరకు చాల కష్టపడుచున్నారు. అందువలన తల్లిదండ్రులను మనము

ప్రేమింపవలదా? ప్రేమింపవలయును. మరియు వారలను గౌరవించుటకును, అనుసరించుటకును, సహాయము చేయుటకును మనము అప్పుబడియున్నాము. వీటినన్నిటిని నెరవేర్చవలయునని నాలుగవఆజ్ఞ కోరుచున్నది. నాలుగవఆజ్ఞ ఏది?

మన తల్లిదండ్రులయెడల మనమెట్లు ప్రవర్తింపవలయునని బాలజేసువు మనకు మాతృక నిచ్చియున్నారు. బాలజేసువు మరియమ్మగారికిని, జోజప్పగారికిని లోబడియుండలేదా? లోబడియుండిరి. బాలజేసువు వారిని ప్రేమించిరి. అట్లే మనము మన తల్లిదండ్రులను, పై యధికారులను ప్రేమించి గౌరవించి వారికి లోబడవలయును. మనము మన తల్లిదండ్రులను ప్రేమింపనియెడల, బాలజేసువు మనలను ప్రేమించెదరా? ప్రేమింపరు.

—* ఐదవ ఆజ్ఞ. *—

ఐదవ ఆజ్ఞ ఏది? ఈ ఆజ్ఞ మొదట మీరినవాడెవడు? కైనుడు. ఎట్లనః—

ఆదాము మొదటి కుమారుడు కైనుడు. వాడు కృషిచేసి జీవించుచుండెను. ఇతని తమ్ముడు ఆబేలుడు. గొఱ్ఱెలను మేపుచుండెను. ఒక పర్యాయము వీరిరువురు వేరు వేరుగా దేవునికి బలులు సమర్పించిరి. దేవుడు ఆబేలుని బలిని ఆమోదించిరి, కైనుని బలిని ఆమోదింపలేదు.

అందుకు కైనుడు కోపించి ఆబేలుని చంప తీర్మానించుకొనెను. ఒకరోజు ఆబేలుడు ఒంటరిగ యున్నప్పుడు కైనుడు వానినికొట్టి చంపెను. సర్వేశ్వరుడు వెంటనే కైనుని యెదుట ప్రత్యక్షమై కోపముతో వానిని శపించిరి. వాడు హంతకుడని

అందరు తెలిసికొనుటకై, వాని నొసటిమీద నొకముద్రవైచిరి. కైనుడు మహానిర్భాగ్యుడై మరణపర్యంతము లోకమంతట తిరుగ వలసివచ్చెను. చూచితిరా! నరహత్య ఎంత ఘోరమైన పాపమో!

నరహత్య చేయవచ్చునా? చేయకూడదు. ఆత్మహత్య చేసుకొనవచ్చునా? చేసుకొనకూడదు. మనము మనశరీరమున కైనను, యితరుల శరీరమునకైనను యేదొక్క కీడు చేయ రాదు. మనము మనయొక్కయు, ఇతరులయొక్కయు పేరు చెడగొట్టవచ్చునా? చెడగొట్టరాదు. వీటి నన్నిటిని నరహత్య చేయకయుందువుగాక అను ఆజ్ఞ నిషేధించుచున్నది.

—* ఆ ర వ, తొ మ్మి ద వ ఆ జ్ఞ లు. *—

ఆరవ ఆజ్ఞ ఏది? వ్యభిచారమునకు అశుద్ధ పాపమని పేరు. అది మనలను అపవిత్రులనుగా జేయుచున్నది. ఈ పాప మును సర్వేశ్వరుడు చాల ద్వేషించుచున్నారు. దీనికి రెండు దృష్టాంతములు చెప్పెదము.

పూర్వమొకప్పుడు అశుద్ధపాపము లోకమంత ప్రబ లమైయుండెను. నోయుడొకడు మాత్రము నీతిమంతుడై యుండెను. అందుకు సర్వేశ్వరుడు కోపించి జలప్రళయము వే మనుష్యులను, మృగములను, పక్షులను, నాశనము చేసెను. నోయునితో నావలో నెక్కిన ఆయన కుటుంబము, మృగములు, పక్షులు మాత్రము రక్షింపబడెను.

ఇంకొకప్పుడు సోదోము, గోమొర్ర అను రెండు పట్ట ణములందుండు జనులు, అశుద్ధపాపముతో మునిగి జీవించు చుండిరి. దానికి శిక్షగా సర్వేశ్వరుడు అగ్నివాన కురిపించి

ఆపట్టణములను వాటియందు నివసించువారందరిని కాల్చివేసిరి. సర్వేశ్వరుడు ఈ పాపమును అంతయెక్కువగ ద్వేషించు చున్నారు.

మనము అశుద్ధ పాపము చేయుటకుగూడ ఆశింప కూడదు. తొమ్మిదవ ఆజ్ఞ అశుద్ధ ఆశలనుగూడ నిషేధించు చున్నది. తొమ్మిదవ ఆజ్ఞ చెప్పుడు?

—* ఏడవ, పదియవ ఆజ్ఞలు. *—

ఏడవ ఆజ్ఞ ఏది? న్యాయముగా మనకు వచ్చినవి, మనము సంపాదించినవి మనవే. వాటిని కాపాడుటకును, ఇష్టానుసారముగా నుపయోగించుటకును మనకు హక్కు గలదు. మన వస్తువులను ఇతరులు దొంగిలించుట మనకు ఇష్టమా? ఇష్టములేదు. ఇతరుల వస్తువులను వారికి తెలియకుండా తీసికొనుట సరియేనా? సరికాదు. అట్లు చేయుట పాపము. దొంగిలించిన వస్తువులను తిరిగి యివ్వకపోయినయెడల, ఆపాపమునకు మన్నింపులేదు.

పరుల సొమ్ములను మనము ఆశింపవచ్చునా? ఆశింపరాదు. పరుల సొమ్ములను ఆశింపరాదని పదియవ ఆజ్ఞ నేర్పుచున్నది పదియవ ఆజ్ఞ ఏది?

—* ఎనిమిదవ ఆజ్ఞ. *—

ఎనిమిదవ ఆజ్ఞ ఏది? చేయనితప్పు చేసితిమని మనపై నేరము మోపుట మనకు సమ్మతమేనా? సమ్మతము కాదు. ఇతరులమీద మనము అన్యాయముగా తప్పుమోపుట న్యాయమేనా? న్యాయము కాదు. అబద్ధ సాక్ష్యము చెప్పుట

దేవునికి చాల అయిష్టము. అబద్ధము చెప్పరాదని ఈ ఆజ్ఞ నేర్పుచున్నది. అబద్ధము చెప్పెడివారలను ఇతరులు నమ్ము దురా? నమ్మరు. కొన్ని సమయములలో శిక్ష తప్పించుకొనుటకు. బాలబాలికలు అబద్ధము చెప్పుచున్నారు. కానీ అబద్ధము చెప్పుటవలన, ఎక్కువ శిక్ష అనుభవింపవలసి వచ్చును. మనము సత్యమును ప్రేమింపవలయును. సత్యము పాలించినయెడల అది మనలను కాపాడును.

ప్ర యో గ ము.

సర్వేశ్వరుని ఆజ్ఞలు మోక్షమునకు మార్గములుగ నున్నవి. మనకర్త జేసునాధస్వామి చెప్పిన రీతిన "నీవు నిత్య జీవములోనికి ప్రవేశింపగోరు పక్షమున, వేదాజ్ఞలను నెరవేర్చుదువుగాక." ఈ ఆజ్ఞలలో ఒకదానినైనను విడిచి పెట్టక, అన్నిటి ప్రకారము నడచుకొనవలయును. ఏదైన ఒకఆజ్ఞ మీరిన అన్నియాజ్ఞలు మీరినట్లే. అందువలన అన్ని ఆజ్ఞల ప్రకారము నడచుటకు మనము ప్రయాసపడవలయును.

## 2. తిరుసభ కట్టడలు.

తొలిపలుకు:— జేసునాధస్వామిని విశ్వసించి, జ్ఞానస్నానముపొంది, పరిశుద్ధ పాపుగారికి లోబడిన విశ్వాసుల సమూహమే తిరుసభ. తిరుసభను స్థాపించినవారు జేసునాధస్వామి. వారు అర్చ్యశిష్ట రాయప్పను తిరుసభకు తలగా నియమించిరి. అర్చ్యశిష్ట రాయప్పగారి యనంతరము రోమాపురిలోనున్న మేత్రాణులవారు కాలక్రమముగ, రాయప్పగారి స్థానమునకు వచ్చినవారే. వారినే మనము పాపుగారని

పిలుచుచున్నాము. తిరుసభ సభ్యులను సక్రమముగా నడిపించుటకు నియమములు కట్టడలు అవసరమై యున్నవి. అందువలన నియమములు ఏర్పరచుటకును, కట్టడలు ఇచ్చుటకును, సభాధికారులకు అధికారమును సభ్యులకు వాటి ప్రకారము నడచుటకు అప్పను గలదు. ఈ అధికారము నుపయోగించి, తిరుసభాధికారులు లప్పుడప్పుడు, అనేక నియమముల నేర్పఱచిరి. వాటిలో ముఖ్యమగు ఆరు కట్టడలను గురించి చెప్పెదము.

తిరుసభను ఎవరు స్థాపించిరి? తిరుసభకు తలగా జేసునాథస్వామి యెవరిని నియమించెను? అర్చ్యశిష్ట రాయప్పగారి వెనుక వారి స్థానమునకు వచ్చినవారిని ఏమని పిలిచెదము? తిరుసభ కట్టడల ప్రకారము నడచుటకు మనకు అప్ప కలదా? ఇప్పుడు మనలను పాలించు పాపుగారి పేరేమి?

కంఠపాఠము.

1. ఆదివారములలోను, అప్పుపండుగలలోను శరీరకష్టమైన పనులను చేయక నిండుపూజ కనుదువుగాక.
2. ఏడాదికి ఒక్కసారియైనను పాపసంకీర్తనము చేయుదువుగాక.
3. పాస్క పండుగలలో దివ్యసత్ప్రసాదము లోకొనుదువుగాక.
4. శుక్రవారములలోను, ఇతర శుద్ధ భోజనదినములలోను, మాంసమును భుజింపక తిరుసభ కట్టడ చేసిన దినములలో ఒక్కపొద్దుగా నుందువుగాక.

5. తిరుసభయొక్క చట్టములనుమీరి వివాహాము చేసు కొనక యుందువుగాక.

6. విచారణ గురువులకు సహాయము చేయుదువుగాక.

వ్యాఖ్యానము

మొదటి కట్టడ;—తిరుసభ మొదటి కట్టడ ఏది? జేసు నాధస్వామి యెట్లు మరణము పొందిరి? ఎవరి కొరకు వారు తమరక్తము చిందిరి? ఆదాముని పాపమువలన మనమందరము పాపులమైతిమి. సర్వేశ్వరునకు శత్రువులమైతిమి. అందువలన జేసునాధస్వామి మనకొరకు స్లీవమీద మరణము పొంది, ఒక బలిని నిత్యపితకు సమర్పించిరి. ఇట్లు సర్వేశ్వరుని సమాధాన పరచిరి. నిత్యరక్షణకు కావలసిన వరప్రసాదము సంపాదించి మనకు యిచ్చిరి. స్లీవమీద బలిసమర్పించిన వారెవరు? జేసు నాధస్వామి. ఎవరిని బలిగా అర్పించిరి? తనను తాను బలిగా అర్పించిరి. ఎందుకు తనను తాము బలిగా అర్పించుకొనిరి? మానవులను రక్షించుట కొరకు.

స్లీవ బలిద్వారా దేవవరప్రసాదము సంపాదించిరి. ఈ దేవ వరప్రసాదము మనలో ప్రవహించుటకు, వారు ఒక బలిని స్థాపించిరి. ఈ బలియే దివ్యపూజ. దివ్యపూజయందు జేసునాధస్వామి వేంచేసి వచ్చుచున్నారు. ఈ బలియందు అర్పింపబడు బలివస్తువును, ఆబలివస్తువును అర్పించువారును జేసునాధస్వామియే. నాడు కపాలపర్వతముపై జేసువు సమ ర్పించిన బలియందు తమరక్తము చిందిరి. నేడు పీఠముపై గురువుద్వార సమర్పింపబడు పూజబలియందు రక్తము చిందుట

లేదు. కపాలపర్వత బలికిని, పూజ బలికిని భేదమువదియే. దివ్య పూజయందు యెవరు వేంచేసి వచ్చుచున్నారు? పూజబలి అర్పించువారెవరు? దివ్యపూజయందుండు బలిసస్తునెవరు?

అందువలన మనము భక్తితో పూజను చూడవలయును. పూజలో మనవి చేసుకొను మేలులన్నియు మనకు లభించును. ప్రతిదినము పూజచూచుట చాలమంచిది.

కొన్నిదినములలో దివ్యపూజ చూడవలయునని తిరుసభ ఆజ్ఞాపించుచున్నది. ఆదినములేవి? ఆదివారములు, అప్పు పండుగలు. ఆరోజులలో తగిన కారణములేక పూజ చూడక పోవుట చాలైన పాపము,

— ♦ రెండవ కట్టడ. ♦ —

పాపసంకీర్తనము:— మనము తప్పుచేయుచున్నప్పుడు మనతల్లిదండ్రులకు కోపము వచ్చునుగదా? అవును, కోపము వచ్చును. వారలను శాంతపఱచుటకు మనమేమి చేయవలయును? మనము మనతప్పుల నొప్పుకొని దుఃఖపడి మన్నన అడుగవలయును. మనము పాపము కట్టుకొనునప్పుడు సర్వేశ్వరునికి కోపమువచ్చునుగదా? కోపమువచ్చును. సర్వేశ్వరుని కోపము చల్లార్చి వారిప్రేమను సంపాదించుటకు మనమేమి చేయవలయును? మనము మనపాపముల నొప్పుకొని దుఃఖము పడి వాటికి మన్నింపు అడుగవలయును. ఇట్లు చేయుటయే పాపసంకీర్తనము. మనము గురువుతో పాపసంకీర్తనము చేయునపుడు సర్వేశ్వరునితోనే పాపసంకీర్తనము చేయుచున్నాము. ఎందుకన గురువు సర్వేశ్వరుని ప్రతినిధి.

పాపసంకీర్తనమును గురించి తిరుసభయొక్క కట్టడ ఏమి? ఏడాది కొకసారియైనను పాపసంకీర్తనము చేయవలయును. సంవత్సరమున కొకసారియైనను అనికట్టడ కానీ సంవత్సరమున కొకసారి మాత్రమే యనికాదు. అందువలన మనము సంవత్సరమునందు అనేకపర్యాయములు పాపసంకీర్తనము చేయవలయునని తిరుసభ కోరుచున్నది. ఇది మనము బాగుగా గ్రహింపవలయును. కాబట్టి పలుమారు పాపసంకీర్తనము చేయుట మనకెంతో ప్రయోజనకరము.

—♦ మూ డ వ క ట్ట డ. ♦—

దివ్యసత్ప్రసాదము;—జేసునాథస్వామి వారి జీవితకాలమందు లెక్కలేని అద్భుతములను చేసిరి. వారు నీళ్ళను ద్రాక్షరసముగా మార్చిరి. రొట్టెలను వృద్ధిచేసి రెండుమారులు జనుల ఆకలిని దీర్చిరి. చెలరేగిన సముద్రమును శాంతపఱచిరి. చనిపోయినవారలను జీవముతో లేపిరి.

కడన మనలను విడిచిపోవు సమయము వచ్చినది. కాని వదలి వెళ్లుటకు వారికి మనపైగల ప్రేమ సమ్మతింపలేదు. మనతో సదావాసముచేయుటకు వారు ఒకమార్గము కనిపెట్టిరి. ఇందునిమిత్తము అప్పమును, ద్రాక్షరసమును తమశరీరముగను, రక్తముగను మార్చిరి. ఇట్లే మనకు వారు తనను తాను ఆత్మయాహారముగా నొసంగిరి. లోకాంత్యమువరకు మనతో వాసము చేయుటకు వారు చిత్తగించిన మార్గమిదే. దివ్యసత్ప్రసాదమునందు ఎవరు వేంచేసియున్నారు? మనకర్త జేసునాథస్వామి.

దివ్యసత్ప్రసాదము లోకొనటను గురించి తిరుసభ కట్టడయేమి? పాస్కకాలములో దివ్యసత్ప్రసాదము లోకొనవలయును. పాస్కకాలమందు దివ్యసత్ప్రసాదము లోకొనవలయునని కట్టడయిచ్చుటకు కారణమేదనగా. దివ్యగొఱ్ఱెపిల్లయైన జేసునాధస్వామి తనను తాను మనకొరకు బలిగా నర్పించినదియు, మనకు తన శరీరమును భోజనముగా నిచ్చినదియు యీకాలములోనే.

ఐనను సంవత్సరమునకొకమారు మాత్రము దివ్యసత్ప్రసాదము లోకొనుట చాలదు. మొదటి శుక్రవారములలోను, పండుగలలోను దివ్యసత్ప్రసాదము లోకొనుట మంచిది వీలుండిన ప్రతిదినము దివ్యసత్ప్రసాదము లోకొనుట మన కెంతో ప్రయోజనకరముగా యుండును.

—* నాలుగవ కట్టడ *—

తిరుసభయొక్క నాలుగవ కట్టడ ఏది? ఒక్కప్రొద్దు దినములలో ఒకసారిమాత్రము నిండుభోజనము చేయవచ్చును. శుద్ధభోజన దినములలో మాంసము భుజింపకూడదు. శరీర దురాశాపాశములను జయించుటకు తిరుసభ ఒక్కప్రొద్దును శుద్ధభోజనమును యేర్పరచినది.

—* ఐదవకట్టడ. *—

తిరుసభయొక్క ఐదవకట్టడ ఏది? అగమన తపస్సు కాలములందు వివాహము చేసుకొనవచ్చునా? చేసుకొనరాదు. తపస్సు కాలము తపస్సు చేసుకొనుటకు యేర్పాటు చేయబడినది. అందువలన తిరుసభ ఈ రోజులలో జ్ఞానవివాహము చేయుట నిషేధించుచున్నది.

దగ్గర బంధుత్వముగలవారు సోదరసోదగీలవలె జీవింప వలయును. అందువలన వారు వారలతో పెండ్లిచేయుట మంచిదేనా? మంచిదికాదు.

ఇతర మతస్థులతో జ్ఞానవివాహము చేసుకొనినయెడల పుట్టు బిడ్డలకు కతోలికు మత సత్యములను నేర్పించుటకు కష్టము కలుగవచ్చును. మరియు విశ్వాసములందుండు భేదము చాలకష్టములకు కారణమగుచున్నది. అందువలన యితర మతస్థులతో జ్ఞానవివాహమును తిరుసభ నిషేధించుచున్నది.

—* ఆరవ కట్టడ *—

తిరుసభ ఆరవకట్టడ ఏది? విశ్వాసుల ఆధ్యాత్మిక విధులను గురువులు కాపాడుచున్నారు. అందువలన గురువులను యెవరు పోషింపవలయును? విశ్వాసులు. ఇందుకుగాను తిరుసభ మనకు కొన్ని కట్టడలను యేర్పాటు గావించియున్నది. వాటికి మనము లోబడవలయును.

## ప్రయోగము.

తిరుసభను యెవరు స్థాపించిరి? సర్వేశ్వరుని సుతుడైన జేసునాథస్వామి? కాబట్టి తిరుసభను అనుసరింపక పోవుట జేసునాథస్వామిని అనుసరింపకపోవుటతో సమానము. "సభను వినకపోవు పక్షమున నీకు వాడు అవిశ్వాసునిగాను, పుబ్లికానుడుగా నుండునుగాక" అనియే జేసువు వక్కాణించినది. మనము మంచిబిడ్డలవలె సభాధికారుల ఆజ్ఞలకు వినయముతో లోబడవలయును.

## 3. తలయైన పాపములు - వాటికి విరుద్ధమైన పుణ్యములు.

తొలిపలుకు — మంచిపూలతోటను మీరు చూచి యున్నారా? ఏ యే రంగులుగల పుష్పములను మీరు అక్కడ చూచియున్నారు? వివిధ రంగులుగల పువ్వులు వికసించియుండు తోట కన్నుల పండువుగా నుండును. మన హృదయము ఇట్లు అందముగల మంచి పూలతోటగా నుండవలయును. అందుకు దీనత, ఓర్పు, సోదరప్రేమ యను పుణ్యములు మనయందభివృద్ధి జెందునట్లుగా కృషి చేయవలయును. అవి బాగుగ పెరిగి పుష్పించుట చూచినపుడు జేసునాథస్వామికి చాలా సంతోషము కలుగును. వారు అట్టి హృదయమున నివసింప గోరుదురు. రాళ్లు, ముళ్ళతీగలున్నచోట పూలచెట్లు చక్కగా పెరుగునా? పెరుగవు. పూలచెట్లు నాటుటకు ముందు రాళ్ళు, ముళ్ళతీగలు తీసివేసి నేల ప్రాన్ని బాగుచేయవలయును. అట్లే మనహృదయమునందు అహంకారము, క్రోధము, భోజనప్రియము మొదలైన దుర్గుణములు లేకుండ చేయవలయును.

మనహృదయ తోటను అరణ్యముగా జేయు ప్రధానమైన యేడు దుర్గుణములు గలవు. అవి పెక్కుపాపములకు కారణములుగ నున్నవి. అందువలన అవి తలయైన పాపములని పిలువబడుచున్నవి. వాటినన్నిటిని మనహృదయము నుండి తొలగించి, వాటికి విరుద్ధమైన పుణ్యములను మనలో నాటి పోషింపవలయును. అట్లు చేసిన మన హృదయము జేసునాథస్వామికి ప్రియమైన ఉద్యానవనము కాగలదు.

## కంఠపాఠము.

1 అహంకారము — దీనత
2 లోభితనము — ఉదారత్వము
3 మోహము — విరక్తత్వము
4 క్రోధము — ఓర్పు
5 భోజనప్రియము — మితభోజనము
6 మాత్సర్యము — సోదరప్రేమ
7 సోమరితనము — శ్రద్ధ

## వ్యాఖ్యానము.

I. దీనత జేసునాథస్వామికి మిగుల ప్రియమైన పుణ్యము. 'నేను సాత్వికుడననియు, దైన్యహృదయుడననియు నాయొద్ద నుండి నేర్చుకొనుడు. అప్పుడు మీయాత్మలకు నెమ్మది కనుగొనుదురు' అనిగదా జేసువు వక్కాణించినది. అందువలన ఈ పుణ్యము మనయందు పెరిగి వృద్ధిజెందుటకు, జేసునాథస్వామి నుండియే మనము నేర్చుకొనవలయును. దీనతను నాశనముచేయు దుర్గుణమేది? అహంకారము. అహంకారము చాల ఆపదలకు కారణమైయున్నది. సన్మనస్కులు పిశాచులుగామారి నరకములో త్రోయబడుటకు కారణమేమి? అహంకారము. ఆదాముని పతనమునకు నిదియే కారణముగానున్నది. అందువలన అహంకారమును మనహృదయములనుండి కూకటివ్రేళ్ళతోసహా పెరికివేయవలయును. దీనత మనయందు పెరిగి పుష్పించుటకు ప్రయాసపడవలయును.

II. సీతాశోక చిలుక తేనెకొఱకు పువ్వులపై నెగురు చుండుట మీరు చూచియున్నారుగదా? ఎక్కువ తేనెగల పూవువలెనే ఉదారత్వము అందరిని ఆకర్షించుచున్నది. దీనికి విరుద్ధమైన దుర్గుణమేమి? లోభితనము. లోభితనమునకు పిశినారితనమని కూడ పేరుగలదు. పిశినారివారలు ఇతరులకు సహాయము చేయుదురా? చేయరు. తమకు కావలసిన ఖర్చులను పెట్టెదరా? పెట్టరు. పిశినారివారల ధనమును ఇతరులు తినెదరని సామెత. కనుక లోభితనమును ద్వేషించి ఉదారత్వము అలవరచుకొనవలయును.

III. విరక్తత్వము అను పుణ్యము లిల్లీ పుష్పమునకు సమానము. ఇది సన్యాసుల పుణ్యమని పిలువబడుచున్నది. దీనిశత్రువు మోహము. జలప్రళయము ఈపాపమునకు శిక్షగా వచ్చినదని తలంచి దీనికి మనము చాల భయపడవలయును.

IV. ఓర్పు, మనహృదయవాటిక కొక అలంకారము. కోపము దీనిని నాశనము చేయుచున్నది. కోపముగానుండు వారలముఖము మీరు చూచియున్నారా? ఎంతో భయము కలిగించునుగదా? అందువలన కోపమునకు దాసుడవుగాక ఓర్పును అలవరచుకొనుము.

V. మితభోజులు ప్రేమపాత్రులగుదురు. తిండిపోతులను అందరు ఏవగించుకొందురు. మితభోజనము మన హృదయవాటికలోనాటి పోషింపవలసిన ఇంకొక విశిష్ట కుసుమము. దీనికి విరుద్ధమైన దుర్గుణమేది? భోజనప్రియము. భోజనవిషయములో మితిమీరినప్రేమ కలిగి యుండుట తప్పు.

తిండిపోతులను అందరు పరిహసింతురుగదా?

VI. పుష్పములయొక్క రాజ్ఞి యేది? రోజాపుష్పము. అదేవిధముగా పుణ్యపుష్పములందు విశిష్టమైనది సోదరప్రేమ. సోదరప్రేమగలవారలు ఇతరులకు మేలురావలయునని కోరు చుందురు. వారికి మేళ్లు సంభవించినపుడు సంతోషించెదరు. ఇతరులకు సంభవించెడు మేలునుగాంచి దుఃఖించుట అసూయ వలననే. అసూయనే మాత్సర్యమందురు. ఈ మాత్స ర్యమును మనము ద్వేషింపవలయును.

VII. శ్రద్ధగల బాలబాలికలను చూచుట అందరికిని సంతోషము. అందువలన శ్రద్ధయను పుణ్యము మనయం దెల్లప్పుడు వికసించియుండుటకు ప్రయాసపడవలయును. సోమరివారలకు ఆధ్యాత్మికాభివృద్ధిగాని, శారీరకాభివృద్ధిగాని కలుగదు.

## ప్రయోగము.

జాగ్రత్తగా పోషింపబడుచున్న తోటలోకూడ గడ్డి, అలుము మొదలైన కలుపు మొలచుచున్నదిగదా? కలుపు విత్తనములు భూమియందుండు విధమున అహంకారము, క్రోధము, అసూయ మొదలైన దుర్గుణములనెడు విత్తనములు మనయందు దాగియున్నవి. మంచితోటమాలి పలుమారు కలుపుతీసి తోటను బాగుపరచుట చూచియున్నారా? అదేరీతిని మనమును, మనజీవితకాలమంతయు ఈపాపగుణ ములనెదిరించి వాటికి విరుద్ధమైన పుణ్యములను సంపాదింప పయత్నింపవలయును.

## 4. దేవద్రవ్యానుమానములు.

తొలిపలుకు:— జేసునాథస్వామి పశువుల కొట్టములో పుట్టి, దరిద్రులుగా జీవించి, అనేక పాటులనుపొంది స్లీవమీద మరణము చెందిరి. వారీదురితముల నెందుకనుభవించిరి? మన నిత్యరక్షణమునకు కావలసిన దేవ వరప్రసాదములను పాలించుటకై వారీదురితముల ననుభవించిరి. ఈ అనుగ్రహాములను మనము స్వాధీనపరచుకొననియెడల రక్షింపబడుదుమా? రక్షింపబడము. జేసువు తన స్లీవ మరణముద్వారా తరగని వరప్రసాద నిధిని సంపాదించియున్నారు. ఆ నిధినుండి వరప్రసాదములు, దేవద్రవ్యానుమానములనెడు కాలువల ద్వారా మనలోనికి ప్రవహించుచున్నవి.

కంఠపాఠము.

1. జ్ఞానస్నానము, 2. భద్రమైన అభ్యంగము, 3. దివ్యసత్ప్రసాదము, 4. పాపసంకీర్తనము, 5. అవస్థ అభ్యంగము, 6. గురుపట్టము, 7. జ్ఞానవివాహము.

వ్యాఖ్యానము.

1. జ్ఞానస్నానము;— దేవుడు ఆదామును చాల ప్రేమించిరి. దేవ వరప్రసాదమువలన దైవ పుత్రత్వమును, మోక్షావకాశమును ఆదామునకుండెను. కానీ ఆదాము నిషేధింపబడిన ఫలము భుజించుటవలన దేవుడు కోపించి ఆదామునికిగల వరప్రసాదస్థితిని తొలగించిరి. ఆ కారణమున మానవులు వరప్రసాదహీనులైరి. ఈ స్థితిలో మనకు దైవపుత్రత్వముగాని, మోక్షావకాశముగాని లేదు. ఈ నిర్భాగ్య

వస్థకే జన్మపాపమని పేరు.

శరీరమందుగల మాలిన్యము తీసివేయుటకు మనమేమి చేయుచున్నాము? స్నానము చేయుచున్నాము. అదేరీతిని మన యాత్మనుండి జన్మపాప మలినము తొలగించుటకు, ఒక పవిత్ర స్నానము యేర్పాటు చేయబడియున్నది. ఆ స్నానము పేరేమి? జ్ఞానస్నానము. జ్ఞానస్నానము మన జన్మపాప మలినమును తొలగించి దేవుని బిడ్డలనుగ, మోక్షమునకు హక్కుదారులునుగ జేయుచున్నది. ఒక శిశువు జ్ఞానస్నానము తీసిన వెంటనే మరణించిన యెడల యెక్కడికి పోవును? మోక్షమునకు పోవును.

2. భద్రమైన అభ్యంగము,—అభ్యంగమనగా లేపనము లేక పూయుట అని అర్థము. ఈ దేవద్రవ్యానుమానము నిచ్చునపుడు మేత్రాణులు, పరిశుద్ధ తైలముతో మన నొసట లేపనము చేయుచున్నారు.

మనలను దేవుని బిడ్డలుగా జేయు దేవద్రవ్యానుమానమేది? జ్ఞానస్నానము. జ్ఞానస్నానము మనకు మోక్షముపై హక్కునిచ్చుచున్నది. ఐతే మనము మోక్షము చేరకుండునట్లు ప్రయాసపడు కొందఱు శత్రువులు మనకు కలరు. అవి యేవి? లోకము, పిశాచి, శరీరము. ఈ శత్రువులతో యుద్ధముచేసి జయించనియెడల మన మెక్కడికి పోదుము? నరకమునకు పోదుము. భయంకరులైన పిశాచులను, తదితర శత్రువులను ఎదిరించి జయించుటకు మనకు శక్తిగలదా? లేదు. దైవసహాయముతో మనము మన శత్రువులను జయింపగలమా?

జయింపగలము. మన ఆధ్యాత్మిక శతృవులను జయించుటకు కావలసిన శక్తినిచ్చు దేవ ప్రసాదానుమానమే భద్రమైన అభ్యంగము. అందువలన భద్రమైన అభ్యంగము జేసునాధ స్వామియొక్క సైనికుడుగా జేయు దేవప్రసాదానుమానమని చెప్పబడుచున్నది.

3. దివ్యసత్ప్రసాదము:— ఆకలిగొని అలసినపుడు మనమేమిచేయుచున్నాము? భోజనము చేయుచున్నాము. భోజనము శరీరమునకు శక్తినిచ్చును. మన ఆత్మకు శక్తినిచ్చుటకు జేసునాధస్వామి ఒక దివ్యభోజనము ఏర్పాటు చేసియున్నారు. ఆభోజనము పేరేమి? దివ్యసత్ప్రసాదము. దివ్యసత్ప్రసాదము లో యెవరు వేంచేసియున్నారు? మనకర్త జేసునాధస్వామి. దివ్యసత్ప్రసాదము లోకొనునప్పుడు ఎవరిని మనము స్వీకరించుచున్నాము? జేసునాధస్వామిని. జేసునాధస్వామి నిజమైన దేవుడు. అందువలన దివ్యసత్ప్రసాదము లోకొనునప్పుడు దేవుడే మనహృదయములలో వేంచేసి వచ్చుచున్నాడు.

4. పాపసంకీర్తనము:— యుద్ధములో సైనికులు గాయపడుదురా? గాయములు బాగుచేయించుకొనుటకు యెవరికి చూపించెదరు? వైద్యులకు చూపించెదరు. వైద్యులు మందువేసి కట్టుకట్టి వాటిని బాగుచేయుచున్నారు.

అదేవిధముగా పిశాచులతోను, తదితర శత్రువులతోను చేయు యుద్ధములో మనఆత్మకు కొన్ని సమయములందు గాయములు కలుగుచున్నవి. ఆత్మయొక్క గాయమునకు పేరేమి? పాపము. పాపగాయములను బాగుచేయు వైద్యులెవరు? గురువులు. అందువలన మనపాపములను గురువులకు

చూపవలయును. అనగా మనపాపములను గురువు యెదుట ఒప్పుకొనవలయును ఇట్లు చేసిన పాపముల నొప్పుకొనుటయే పాపసంకీర్తనము.

కొన్ని గాయములు ప్రాణాపాయకరమైనవి గదా? ఔను. అదేరీతిగ చావైన పాపము ఆత్మను జబ్బుగాయపర్చి యున్నది. మనఆత్మ చావైన పాపమువలన మరణించినను, పాపసంకీర్తనముద్వారా దానికి మరల జీవము లభించగలదు.

5 అవస్థాభ్యంగము:— మరణ సమయము భయంకరమైనది. వ్యాధియొక్క నొప్పియును, తీర్పునొక్క భయమును, పిశాచులయొక్క శోధనలును మనలను కష్టపెట్టును. వ్యాధులవలన జనించు బాధలను ఓర్పుతో సహించుటకును పిశాచి శోధనల నెదిరించుటకును, ఈ దేవద్రవ్యానుమానము మనకు శక్తి నిచ్చుచున్నది. అంతేగాక అవస్థాభ్యంగ ఫలితము ఆత్మకుపకరించిన యెడల ఆరోగ్యము శరీరమునకుగూడ లభించును.

సూచన:— మొదటి ఐదు దేవద్రవ్యానుమానములు ప్రతి మానవునికి అవసరమై యున్నవి. జ్ఞానస్నానము మనలను దేవుని బిడ్డలనుగా జేయును. భద్రమైన అభ్యంగము మనలను విశ్వాసమందు స్థిరపరచును. దివ్యసత్ప్రసాదము మనఆత్మకు దివ్యభోజనము. ఆత్మవ్యాధులను గుణపరచుచున్నదే పాపసంకీర్తనము. తుదియుద్ధమందు పిశాచిని యెదిరించుటకు అవస్థాభ్యంగము, మనకు శక్తి నిచ్చుచున్నది.

6. గురుపట్టము,—మనకు దేవునిగూర్చియు, మోక్షమును గూర్చియు నేర్పించుటకు అధ్యాపకులు అవసరమా? అవసరము. మన ఆత్మవ్యాధులను కనుగొని చికిత్స చేయుటకు వైద్యులు కావలయునా? కావలయును. మన ఆత్మభోజనము దివ్యసత్ప్రసాదముకదా? దివ్యసత్ప్రసాదము. ప్రతిష్ఠించుటకును, మనకు పంచియిచ్చుటకును దైవ యూజకము నెరవేర్చువారు ఉండవలదా? ఉండవలయును. విశ్వాసుల నడిపించుటకు నాయకులు తప్పనిసరిగా కావలయును. మన ఆధ్యాత్మిక అవసరములను నిర్వహించుటకు అధ్యాపకులును, వైద్యులును, నాయకులును అవసరమైయున్నారు. ఇటువంటివారలను ప్రతిష్ఠించు దేవద్రవ్యానుమానమే గురుపట్టము.

7. జ్ఞానవివాహము;—మోక్షము నందుండు మన తండ్రియెవరు? దేవుడు. మనలను పెంచి పెద్దచేయుటకు దేవుడు ఎవరిని ఏర్పరచియున్నారు? తల్లిదండ్రులను ఏర్పరచియున్నారు. మన యదార్థ భవనమేది? మోక్షము. మోక్షానుగాములనుగా మనలను పెంచి పెద్దచేయుటకు తల్లిదండ్రులు అప్పగలరు. దేవానుగ్రహములేక వారు ఈ పనిని నెరవేర్చగలరా? నెరవేర్చజాలరు. భార్యాభర్తలకు తమ బిడ్డలను, దేవుని బిడ్డలుగా పెంచుటకు దేవానుగ్రహము కావలయును. ఈ అనుగ్రహము వారికిచ్చు దేవద్రవ్యానుమానమే జ్ఞానవివాహము.

ప్రయోగము.

దేవద్రవ్యానుమానముల ద్వారా మనకు దేవానుగ్రహములు లభించును, ఈ అనుగ్రహములులేక మోక్షము

ప్రవేశించుటకు వీలు లేదు. అందువలన దేవద్రవ్యానుమానములను చాల భక్తితో పొందవలయును.

పాపసంకీర్తనము యొక్కయు, దివ్యసత్ప్రసాదము యొక్కయు, విషయములందు మనమొక సంగతి ముఖ్యముగా గమనింపవలయును. మనము బలహీనులము. అందువలన పలుమారు మనమనేక తప్పులలో పడియుండవచ్చును. పాపసంకీర్తనము, చేసిన పాపములకు మన్నింపును, మీఁదట పాపము చేయకుండుటకు శక్తియు నిచ్చును. దివ్యసత్ప్రసాదము మన ఆత్మకు భోజనము. క్రమముగా భోజనము చేయనియెడల మన శరీరము కృశించిపోవును గదా? మన ఆత్మయొక్క స్థితియు నిట్టిదే. అందువలన ఈ రెండు దేవద్రవ్యానుమానములను పలుమారు తీయుటకు మనము ప్రయాస పడవలయును.

## 5. పాపసంకీర్తన జపము

ఒక పాపాత్ముడు మనస్తాపపడుచున్నప్పుడు సర్వేశ్వరునికి సంతోషము కలుగునా? సంతోషము కలుగును. సన్మనస్కులకును, ఇతర మోక్షవాసులకును సంతోషము కలుగునా? సంతోషము కలుగును. మనము పాపము చేయుచున్నప్పుడు వారందరికి దుఃఖము కలుగుచున్నదా? కలుగుచున్నది. అందువలన మనము పాపము చేసినయెడల సర్వేశ్వరుని, మోక్షవాసులను మన్నింపు అడుగవలయును. మోక్షవాసులు మనకొఱకు వేడుకొనినయెడల సర్వేశ్వరుడు మనలను మన్నింపరా? మన్నించెదరు. అందువలన మన కొఱకు

వేడుకొనవలయునని మోక్షవాసులను మనవి చేయుట మంచిది.
వీటినన్నిటిని పాపసంకీర్తన జపములో గుణముగ నెరవేర్చుచున్నాము

## కంఠపాఠము.

సర్వశక్తిగల సర్వేశ్వరునితోను, ఎప్పుడును కన్యకయై యుండెడు అర్చ్యశిష్ట మరియమ్మతోను, అతిదూతయగు అర్చ్యశిష్ట మిఖయేలునితోను, స్నాపకుడైన అర్చ్యశిష్ట అరుళప్పతోను, అర్చ్యశిష్ట అపోస్తులైన రాయప్పతోను, చిన్నప్పతోను సకలఅర్చ్యశిష్ట వారలతోను, నాగురువులైన మీతోను పాపసంకీర్తనము చేయుచున్నాను. మిక్కుటమైన తలంపుచేతను, వాక్కుచేతను, క్రియలచేతను బహుపాపములు చేసితిని; ఇదినాతప్పు, నాతప్పు, నాగొప్పతప్పు. అందుచేత ఎప్పుడును కన్యకయైయుండెడు అర్చ్యశిష్ట మరియమ్మయు, అతిదూతయగు అర్చ్యశిష్ట మిఖయేలుడును, స్నాపకుడైన అర్చ్యశిష్ట అరుళప్పయు, అర్చ్యశిష్ట అపోస్తులైన రాయప్పయు, చిన్నప్పయు, సకల అర్చ్యశిష్టవారలును నా గురువులైన మీరును నా కొరకు మనకర్తయైన సర్వేశ్వరుని ప్రార్థింపవలయునని ప్రతిమాలుచున్నాను. ఆమెన్.

## వ్యాఖ్యానము.

ఈజపమునందు రెండు భాగములు కలవు. "నాగొప్ప తప్పు" వఱకు మొదటి భాగము. మిగిలినది రెండవ భాగము. మొదటి భాగము చెప్పండి? ఈ భాగములో మనమేమి చేయుచున్నాము? మనపాపములను ఒప్పుకొను చున్నాము. మనపాపములను యెవరితో ఒప్పుకొను

చున్నాము? సర్వశక్తిగల.. ......గురువుతోను ఒప్పుకొను చున్నాము. సర్వేశ్వరుడును మోక్షవాసులును పాపమును చాల ద్వేషించుచున్నారు. వారికిష్టములేని పాపము చేసినందువలన మన్నింపు అడుగుచున్నాము. పాపసంకీర్తనము విను గురువు యెవరి ప్రతినిధి? సర్వేశ్వరుని ప్రతినిధి. అందువలన వారితోను మనపాపములను ఒప్పుకొని పాపవిమోచనము మనవి చేయుచున్నాము. రెండవ భాగము చెప్పండి? ఈ భాగములో మనమేమి చేయుచున్నాము? మన కొరకు సర్వేశ్వరుని వేడుకొనవలయునని మనవి చేయుచున్నాము. ఎవరిని మనము మనవి చేయుచున్నాము? ఎప్పుడును... ......గురువుతోను మనవి చేయుచున్నాము. వారికి మన పాపములను మన్నించుటకు అధికారము గలదా? లేదు. వారు మనకొరకు వేడుకొనగలరు. సర్వేశ్వరుడు వారి ప్రార్థన ఆలకించెదరా? తప్పక ఆలకించెదరు. ఎందుకనన అర్చ్యశిష్టులును, సన్మనస్కులును సర్వేశ్వరుని మిత్రులు. అర్చ్యశిష్ట మరియమ్మగారు జేసునాథుని తల్లి.

ప్రయోగము.

'సర్వేశ్వరా స్వామి! మీకును, మోక్షమునకును విరోధముగా నేను ద్రోహము చేసితిని. నన్ను క్షమింపుము' అని దుఃఖముతో చెప్పుట చాల మంచిది. పరితాపము సర్వేశ్వరుని గొప్ప అనుగ్రహము. ఈ అనుగ్రహమును దేవమాత యొక్కయు, ఇతర మోక్షవాసుల యొక్కయు మధ్యస్థముద్వారా అడుగుట చాల ప్రయోజనకరము.

## 6. ఉత్తమ మనస్తాప జపము.

తొలిపలుకు:— సన్మనస్కులు పాపముచేసిరి వెంటనే సర్వేశ్వరుడు వారిని మోక్షమునుండి నరకమునకు త్రోసివేసెను. సన్మనస్కులను పిశాచులుగా మార్చినదేమి? పాపము. పాపము మనకు మోక్షముమీది హక్కును పోగొట్టి నరకమునకు పాత్రులనుగా జేయును. పాపము దేవుని మేలగగిన తనమునకు వ్యతిరిక్తముగా జేయు దౌర్జన్యము. ఇదే జేసునాధ స్వామి స్లీవమీద మరణము పొందుటకు కారణము.

ఇట్టి భయంకరమైన పాపమును మన మెన్నడును చేయరాదు. ఒకవేళ పాపములో బడినయెడల తక్షణమే ఏమి చేయవలయును? పాపము కొరకు మనస్తాపపడవలయును. ఇకమీద అట్టి పాపము చేయనని ప్రతిజ్ఞ చేయవలయును. ఈ రెండు సంగతులే ఉత్తమ మనస్తాపజపములో అణగియున్నవి.

### కంఠపాఠము.

సర్వేశ్వరా స్వామీ, దేవర వారు మితిలేని సకలమేలుల స్వరూపులై యుండుటవలన సకల వస్తువులకంటె మిమ్ము అధికముగా ప్రేమించుచున్నాను. మీకు నా పాపములచేత ద్రోహము చేసినందువలన మహామనస్తాప పడుచున్నాను స్వామీ, మహాదుఃఖపడుచున్నాను స్వామీ, మహాఉత్తమ మనస్తాప పడుచున్నాను స్వామీ, ఇకమీదట ఒక్కనాటికిని ఇటువంటి పాపములను చేయనని నిండు మనస్సుతో గట్టి ప్రతిజ్ఞ చేయుచున్నాను.

# వ్యాఖ్యానము

మనస్తాపము రెండు విధములు. 1. ఉత్తమమనస్తాపము 2. దాసత్వ మనస్తాపము. ఇందు ఉత్తమ మనస్తాపము చాల శ్రేష్టమైనది. సర్వేశ్వరుడు సకలమేలుల స్వరూపి. సకల వస్తువుల కంటే అధికముగా ప్రేమించుటకు యోగ్యుడు. ఇట్టి సర్వేశ్వరునికి దుఃఖము రప్పించుచున్న దేది? పాపము. సర్వేశ్వరుని సుతుడైన జేసునాధస్వామి పాటులకును, స్లీవ మరణమునకును కారణమేది? పాపము. ఇట్టి న్యాయములు తలంచినపుడు కలుగు దుఃఖమే ఉత్తమ మనస్తాపము "మహాఉత్తమ మనస్తాప పడుచున్నాను" అనువరకు ఈ జపముయొక్క మొదటి భాగము. ఉత్తమ మనస్తాపమునకు మంచి మాతృక.

చావైన పాపమువలన మనకు కలుగు నష్టమేమి? మోక్షము చావైన పాపమువలన మనము నరకమునకు పాత్రులమగుచున్నాము. పాపము మనలను అశుద్ధులనుగా జేయును. ఇట్లు అనేక నష్టములకు పాపము కారణమగుచున్నది. ఇట్టి నష్టములను తలంచినపుడు కలుగు దుఃఖమే దాసత్వ మనస్తాపము.

మనము బలహీనులము కదా? ఔను బలహీనులమే. కాని సర్వేశ్వరుని అనుగ్రహమునునమ్మి, ఇకమీదట పాపము చేయనని ప్రతిజ్ఞ చేయవలయును. "ఇకమీదట........... ప్రతిజ్ఞ చేయుచున్నాను." ఈ కడ భాగము మంచి ప్రతిజ్ఞకు మాతృక.

ఇట్లు ఉత్తమ మనస్తాప జపమునందు ఉత్తమ మనస్తాపము యొక్కయు, ప్రతిజ్ఞయొక్కయు మంచి ప్రకరణము లణగి యున్నవి.

## ప్రయోగము.

చావైన పాపము ఆత్మయొక్క జీవమైన వరప్రసాదమును, మనలో లేకుండ జేయును. అందువలన చావైన పాపములో మరణించువారలు నరకమునకు పోదురు కనుక చావైన పాపములో యుండుట ఎంత అపాయకరమని మనకు స్పష్టమగుచున్నది. ఒక్కొక్కప్పుడు పాపములో పడిన వెంటనే, పాపసంకీర్తనము చేయుటకు వీలులేకపోవచ్చును. ఇట్టి సందర్భములలో ఉత్తమ మనస్తాపముద్వారా పాపవిమోచనము లభించుననుట, ఎంతో సంతోషకరమైన విషయము. కాని పాపసంకీర్తన అప్పునిలచును. కాబట్టి ఉత్తమమనస్తాపముద్వారా మన్నింపు పొందిన పాపములనుగూడ పాపసంకీర్తనములో చెప్పవలయును. పాపసంకీర్తనమునకు ఉత్తమ మనస్తాపము చాల మంచిది, కానీ దానశ్వ మనస్తాపముండినను చాలును. మనస్తాపమునుండి ప్రతిజ్ఞ వేరుచేయుటకు వీలులేదు. అందువలన ఈ రెండు ప్రకరణములు అణగి యున్న ఉత్తమ మనస్తాప జపము పలుమారు చెప్పుట చాల ప్రయోజనకరము. ముఖ్యముగా ఏదైన పాపములోపడిన వెంటనే, ఈ జపము చెప్పెడి అలవాటు చేసికొనవలయును. (ప్రశ్నలు.)

# 7. మంచి పాపసంకీర్తనమునకు కావలసిన కార్యములు.

తొలిపలుకు:— జన్మపాపమునుండి మనలను కడిగి పరిశుద్ధులనుగ జేయు దేవద్రివ్యానుమానమేది? జ్ఞానస్నానము. జ్ఞానస్నానము పొందిన వెనకచేసిన పాపములను మన్నించుటకు, జేసునాధస్వామి ఒక దేవద్రివ్యానుమానమును స్థాపించియున్నారు. అది ఏది? పాపసంకీర్తనము. ఇది దివ్యరక్షకుడు మనకు ఇచ్చిన గొప్ప దానము. ఈ దేవ ద్రివ్యానుమానమును మనము సులభముగా పొంద వచ్చును. దీనివలన మనకు లభించు ప్రియోజనములు అనేకము. ఎందుకన పాపమువలన నష్టమైన హృదయ సమాధానమును, దేవవరప్రిసాదమును పాపసంకీర్తనము ద్వారా మనకు తిరిగి లభించుచున్నవి. అంతేగాక పాపము వలన పోగొట్టుకొన్న మోక్ష హక్కు కూడ లభించు చున్నది.

ఈ మేలులన్నియు మనకు లభింపవలయునని, మంచి పాపసంకీర్తనము చేయవలయును. అందువలన మంచి పాపసంకీర్తనము చేయుటను గురించి మనము తెలిసికొన వలయును. అందుకు కావలసిన సంగతులు దిగువ చెప్పెదము.

(ప్రిశ్నలు)

కంరపాఠము.

1. తాను చేసిన పాపములను జ్ఞాపక పరచుకొనట.
2. చేసిన పాపముల కొరకు మనస్తాప పడుట.
3. ఇకమీదట పాపములు చేయనని గట్టి ప్రతిజ్ఞ చేయుట.
4. తాను చేసిన చావైన పాపములన్నిటిని గురువునకు బయలు పరచుట.
5. గురువు కట్టడ చేసిన అపరాధమును తీర్చుట

1. ఆత్మశోధన:— చేసిన పాపములు అనగా మనము కడపట చేసిన పాపసంకీర్తనము మొదలు, ఇప్పటి వఱకు చేసిన పాపములని గ్రహింపవలయును. పాపము రెండు విధములు. (1) చావైన పాపము. (2) స్వల్పపాపము. ఏ పాపము పాపసంకీర్తనము చేయుటకు బాధ్యత కలిగించును? చావైనపాపము. అందువలన చావైన పాపములయొక్క సంఖ్య స్వభావము ముఖ్యముగా గమనింపవలయును. స్వల్పపాపములను పాపసంకీర్తనములో చెప్పుటకు అప్పుకలదా? అప్పులేదు. ఐతే వాటినిగూడ బయలుపఱచుట మంచిది.

సూచన:— పాపసంకీర్తనము చేసి చాల రోజులైన వారు సర్వేశ్వరుని ఆజ్ఞలను, తిరుసభ కట్టడలను, తలయైన పాపములను ఒక్కొక్కటిగ తలంచి ఆత్మశోధన చేయవలయును తఱచుగా పాపసంకీర్తనము చేయువారు, కడపటి పాపసంకీర్తనానంతరము చేసిన పాపములను సామాన్యముగా జ్ఞాపకము చేసుకొనిన చాలును.

2. మనస్తాపము,—మనస్తాప విషయమును గురించి ముఖ్యముగ గమనింపవలయును. మనస్తాపము ఎన్ని విధములు? రెండు విధములు. (1) ఉత్తమ మనస్తాపము, (2) దాసత్వ మనస్తాపము. ఈ రెండింటిని గురించి, ఉత్తమ మనస్తాప జప వివరణములో చెప్పియున్నాము. వీనిలో శ్రేష్ఠమైనదేది? ఉత్తమ మనస్తాపము. ఐతే పాపసంకీర్తనము చేయుటకు దాసత్వ మనస్తాపము చాలును. దాసత్వ మనస్తాపముగూడ లేక పాపసంకీర్తనము చేసిన, పాపములు మన్నింపబడునా? మన్నింపబడవు. మనస్తాపము వడిగా వచ్చుటకు క్రొత్తపాపములతో సహా పాతవానిలో ప్రధానమైనవిగూడ జ్ఞాపకము తెచ్చుకొనుట చాల మంచిది. పాపము మాలిన్యముతో నిండినది. అది సర్వవల్లభుని మేలెరిగినతనమునకు వ్యతిరేకముగ జేయు ధిక్కారము. దివ్యరక్షకుని పాటులకును, స్లీవమరణమునకును కారణమేది? పాపము. మోక్షమును పోగొట్టి మనలను నరకమునకు పాత్రులనుగ జేసినదేది? పాపము. ఇంత గొప్ప అక్రమమును చేసినందుకు హృదయపూర్వకముగ దుఃఖింపవలయును.

3. ప్రతిజ్ఞ;—పాపముల కొఱకు దుఃఖించినంత మాత్రము చాలదు. ఇకమీద పాపము చేయనని ప్రతిజ్ఞ చేయవలయును. అంతేగాక పాపకారణములను విడిచిపెట్టుటకు సిద్ధముగ యుండవలయును.

4. పాపముల బయలు పఱచుట,—మనము చేసిన పాపములన్నియు, ఒకటియైనను దాచక పాపసంకీర్తనములో

బయలు పఱచవలయును. ముందు పాపసంకీర్తనములో బయలు పఱచిన చావైన పాపములను, ఇప్పటి స్వల్పపాపములను పాపసంకీర్తనములో చెప్పుట మంచిదా? మంచిది. ఐతే వాటిని పాపసంకీర్తనము చేయుటకు అప్పుగలదా? లేదు.

పాపసంకీర్తనములో చెప్పవలసిన యేదైన చావైన పాపమును దాచిపెట్టి పాపసంకీర్తనము చేయుట దొంగ పాపసంకీర్తనమగును. అట్లు చేసినయెడల దాచిపెట్టిన పాపమునకు మాత్రముగాదు, మరియు ఆపాపసంకీర్తనములో చెప్పిన ఇతర పాపములకుగూడ మన్నింపులేదు. పైగా దేవద్రోహమను ఒక క్రొత్తపాపమును కట్టుకొందుము. తర్వాత మంచి పాపసంకీర్తనము చేయునపుడు, దొంగ పాపసంకీర్తనములో చెప్పినవియును, దాచిపెట్టిన చావైన పాపములను, ఖండితముగా చెప్పవలయును, మరియు దొంగ పాపసంకీర్తనము చేసినాననియు చెప్పవలయును. అదేవిధముగా దొంగ పాపసంకీర్తనానంతరము దివ్యసత్ప్రసాదము లోకొనినయెడల అదియు, ఇతర దేవద్రోహానుమానములు స్వీకరించినయెడల వాటిని, వివరముగ జెప్పవలయును. (ప్రశ్నలు.)

5. పాపసంకీర్తనములో గురువు ఇచ్చిన అపరాధమును నెరవేర్చుటకు మనసు కలిగియుండుట, పాపవిమోచనమునకు అవసరమై యున్నది.

## —♦ పాపసంకీర్తనము చేయువిధము. ♦—

1. పాపసంకీర్తనమునకు ముందు:—మంచి పాపసంకీర్తనము చేయుటకు దేవుని సహాయము వేడుకొనవలయును.

చేసిన పాపములను, ముఖ్యముగా గత పాపసంకీర్తనానంత రము చేసిన చావైన పాపములను జ్ఞాపకము చేసుకొనవల యును. పాపములన్నిటి కొఱకు మనస్తాపపడవలయును. ఇక మీదట పాపములో పడనని గట్టి ప్రతిజ్ఞయును చేయవలయును.

2 పాపసంకీర్తన సమయములో:— గురువు సమీప మున మోకాళ్ళమీదనుండి స్లీవగుఱుతు వేసికొని శిరము వంచి పాపసంకీర్తన జపము "నాగొప్ప తప్పు" వఱకు చెప్ప వలయును. తరువాత శిరము పైకెత్తి "పాపియైన నన్ను ఆశీ ర్వదించండి" అని బ్రతిమాలిన తరువాత, ఎప్పుడు చివరి పాపసంకీర్తనము చేసినది, అపరాధము నెరవేర్చినది లేనిది తెలుపవలయును. గత పాపసంకీర్తనములో ఏమైన పాపములు మరచిపోయినయెడల అవియును చెప్పవలయును. తరువాత క్రొత్తగా చెప్పవలసిన పాపములను చెప్పవలయును. చావైన పాపముల సంఖ్యను, స్వభావమును, వివరముగా తెలియ పఱచుటకు అప్పుగలదు సంఖ్య కచ్చితముగా జ్ఞాపకము లేనియెడల సుమారు ఇన్ని మారులు అని చెప్పిన చాలును. తుదన ఈ పాపముల కొరకును, గత కాలములో చేసిన అన్ని పాపముల కొరకును (ముఖ్యముగా విరక్తత్వమునకును, సోదర ప్రేమకును విరుద్ధముగా చేసిన పాపములకును) నేను మనస్తాప పడుచున్నాను, అని చెప్పుట చాల మంచిది. గురువులు ఇచ్చు ఉపదేశములను, అపరాధమును శ్రద్ధతో వినవలయును,

3. గురువు పాపములను మన్నించు సమయము నందు:— 'నాగొప్ప తప్పు' మొదలుకొని తక్కిన పాపసంకీర్తన జపమును, ఉత్తమ మనస్తాప జపమును శిరమువంచి చెప్పవలయును. లేనివారు గురువునకు స్తోత్రముచెప్పి లేచి పోవచ్చును.

4. పాపసంకీర్తనానంతరము;— అపరాధము త్వరగా నెరవేర్చుటకు ప్రయత్నింపవలయును. లేనియెడల ఒకవేళ మనము మరచిపోవచ్చును. తుదకు మంచి పాపసంకీర్తనము చేయుటకు, సహాయము దయచేసిన దేవునికి స్తోత్రము చెల్లింపవలయును.

ప్రయోగము.

మనము ఎంతజాగ్రత్తగా యుండినను శరీరములో మలినము కలుగుచున్నది. అదే విధముగా చెడిపోయిన మన స్వభావమువలన, ఆత్మకు మలినము అంటుచున్నది. అందువలన ఆత్మ పరిశుద్ధముగా యుండుటకు, పరితాపపు కన్నీటిచే దానిని అప్పుడప్పుడు కడుగుచుండవలయును. ఉత్తమమనస్తాపముద్వారా పాపములకు మన్నింపు లభించును. ఐతే ఉత్తమ మనస్తాపము అన్ని వేళల సులభముగ లభింపదు. అందువలన పాపసంకీర్తనమను దేవద్రవ్యానుమానమును ఆశ్రయించుట ఉత్తమము. ఎందుకన పాపసంకీర్తనముతో గలసిన దాసత్వ మనస్తాపము, పాపవిమోచనమును కలుగజేయును. వీలుండిన యెడల ప్రతివారము పాపసంకీర్తనము చేయవలయును. ఒక నెలకంటె ఎక్కువ ఆలస్యము చేయుట మంచిది కాదు. ఆల

స్యము చేసిన ఎడల చాల రోజులు పాపసంకీర్తనములేక మన ఆధ్యాత్మిక జీవితము చెడిపోవచ్చును. ముఖ్యముగ చావైన పాపములో పడినయెడల వెంటనే పాపసంకీర్తనము చేసి పోగొట్టుకొన్న ఆత్మ జీవము తిరిగి పొందుటకు ప్రయాస పడవలయును. (ప్రశ్నలు.)

## 8. కృ పా ర స జ ప ము.

తొలిపలుకు:— దేవమాతను స్తుతించుటకై, మనము ఎన్ని జపములు నేర్చుకొన్నాము? మంగళవార్త జపము, త్రికాల జపము, అర్చ్యశిష్ట బెర్నర్దుగారి జపము, కృపారస జపము. దేవమాతకు స్తోత్రము చెల్లించుటకు మరియొక మంచి జపము.

### కం ఠ పా ఠ ము.

కృపారసముగల మాతయై యుండెడు రాజ్ఞీ, వందనము. మా జీవమా! మా మధురమా! మా శరణమా! వందనము. పరదేశులమై యుండెడు మేము ఏవయొక్క బిడ్డలము. - మిమ్ముజూచి మొరపెట్టుచున్నాము. - ఈ కన్నీటి కనమ యందు ప్రలాపించి యేడ్చుచు - మిమ్ముజూచి నిట్టూర్పు విడచుచున్నాము. - అందువలన మాకొరకు మనవి చేసెడు తల్లీ! మీదయారసముగల కన్నులను మామీదత్రిప్ప నవధ రించండి. — ఇదిగాక ఈ పరదేశము గడచిన తరువాత, ఆశీర్వ దింపబడిన మీ గర్భఫలమగు జేసునాథుని ప్రత్యక్షమైన దర్శ నమును మాకియ్య నవధరించండి. — కృపగలిగిన తల్లీ, దయా రసము గలిగిన తల్లీ, — ఓ మధురమైన కన్యమరియమ్మా, జేసు క్రీస్తునాథుని దివ్య వాగ్దత్తములకు మేము పాత్రులమగు

నట్లు — సర్వేశ్వరుని పరిశుద్ధమాతా! మా కొరకు ప్రార్థించండి.

వ్యాఖ్యానము.

మన ఆది తల్లిదండ్రులెవరు? ఆదాము, ఏవమ్మ. వారి పాపము వలన లోకము ఏ విధముగా మారెను? కన్నీటి కనముగా మారెను. మన నిజమైన రాజ్యమేది? మోక్ష రాజ్యము. ఈ లోకము మనకు పరదేశము. ఇక్కడ మనము పరదేశులమై యున్నాము. మరియమ్మ ఎటువంటి తల్లి? కృప గల తల్లి. ఏవమ్మ మన మరణమునకు కారణము. ఐన మరియమ్మ మనజీవమును, మధురమును శరణమునై యున్నది. మరియమ్మను మన మేమని వేడుకొనుచున్నాము? 1. ఆమె తన దయారసముగల కన్నులను మనమీాద త్రిప్పవలయు ననియు, 2. ఈలోక జీవితానంతరము తనసుతుడు జేసునాథుని దర్శనము మనకియ్యవలయుననియు, అనగా మనకు మోక్ష భాగ్యము దయచేయవలయుననియు వేడుకొనుచున్నాము.

ప్రయోగము.

మనము ఏవమ్మయొక్క నిర్భాగ్య బిడ్డలము. ఈ లోకము మనకు పరదేశము, కన్నీటి కనుమ. ఐతే మనకొక ప్రేమగల తల్లిగలదు. ఆ తల్లియే కన్య మరియమ్మ. ఆమె దేవమాతయు,స్వర్గరాణియునై యున్నది. అందువలన ఆమెపై మన నమ్మకమునంతయు నుంచి వేడుకొనవలయును. ఆమె తప్పక మన మనవుల నాలకించును. శాశ్వతానంద భవనమునకు ఆమె మనలను గొనిపోవును.

## 9. పాస్క త్రికాల జపము.

తొలిపలుకు:— ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంత్రము చెప్పు జపమేది? త్రికాల జపము. ఆ జపమును మీరు నేర్చుకొన్నారుగదా! ఐతే సంవత్సరమంతయు ఈ త్రికాల జపము చెప్పకూడదు. పాస్క పండుగకు ముందు దినము మొదలుకొని పరిశుద్ధ ఏకత్రిత్వ సర్వేశ్వరుని పండుగ వఱకు "పరలోకముయొక్క రాజ్ఞీ సంతోషించండి" అను త్రికాల జపము చెప్పవలయును. ఈ జపముయొక్క మనోహరమైన చరిత్రమును చెప్పెదము.

ఒకప్పుడు రోమా పట్టణమునందు, అతి భయంకరమైన అంటు వ్యాధి సంభవించెను. వేలకొలది జనులు మరణించిరి. అప్పుడు తిరుసభను పాలించు పాపుగారు ఇదిగాంచి చాల దుఃఖించి ప్రార్థింపసాగిరి. జనులందరు ప్రార్థింపవలయునని ప్రోత్సహించిరి. కానీ అంటువ్యాధి వదలలేదు. అందువలన అర్చ్యశిష్ట లూకాసుగారు చిత్రించిన మరియమ్మ పటము వీధులలో ఊరేగింపవలయునని పాపుగారు ఆజ్ఞాపించిరి. మరియమ్మగారి పటము, ఏ యే వీధుల నూరేగించిరో ఆయా వీధులందు అంటువ్యాధి తత్క్షణమే నిలచిపోయెను. అంతేగాక అడ్రియాన్ అనెడి గోపురముపై ఒక సన్మనస్కుడు రక్తసిక్తమైన తనఖడ్గమును వరలో పెట్టునది అందరు చూచిరి. వెంటనే సన్మనస్కుల సమూహము "పరలోకముయొక్క రాజ్ఞీ" యని పాడుస్వరము అక్కడెల్ల వినిపించెను. ఈ జపముండుండు

"ప్రార్థించుదము" అను భాగము పరిశుద్ధ పాపుగారు వ్రాసి చేర్చినదే. (ప్రశ్నలు)

కంఠపాఠము; — పరలోకమునయొక్క రాజ్ఞీ సంతోషించండి. అల్లేలుయా - ఏలయనిన భాగ్యవతియైన మీ గర్భము నందు అవతరించినారు. అల్లేలుయా - ఆనతిచ్చిన ప్రకారము ఉత్థానమైనారు. అల్లేలుయా - మాకొరకు సర్వేశ్వరుని మనవి చేయండి. అల్లేలుయా - కన్యకగాను యుండెను మరియమ్మా ఆనందించి సంతోషించండి. అల్లేలుయా — ఏలయనిన ఏలిన వారు నిజముగా ఉత్థానమైనారు. అల్లేలుయా.

ప్రార్థించుదము;—సర్వేశ్వరా స్వామి, మీ దివ్య కుమారుడును, మానాథుడునైన, జేసుక్రీస్తుని ఉత్థానముచేత లోకమును సంతోషపరప చిత్తగించితిరే! అతని దివ్యమాతయైన కన్య మరియమ్మవలన నిత్యజీవమైన పరలోకభాగ్యము మేము పొందునట్లుగా అనుగ్రహము చేయ నవధరించండి. జేసుక్రీస్తు నాథుని దివ్యముఖమునుజూచి, ఈ మనవిని మాకు దయ చేయండి. ఆమెన్.

వ్యాఖ్యానము; — పరలోకరాజ్ఞి ఎవరు? అర్చ్యశిష్ట కన్య మరియమ్మ. ఆమె ఎవరి తల్లి? జేసునాథస్వామి తల్లి. సర్వేశ్వరుని పుత్రుడైన జేసునాథునకు తల్లిగానుండు భాగ్యము ఆమెకు లభించినది. అందువలన ఆమెను భాగ్యవతియని చెప్పుచున్నాము. జేసునాథస్వామి తాము పునరుత్థానమగు దుమని ముందుగనే వెలిబింగించి యుండిరి. అట్లువారు సజీవులై లేచిరా? లేచిరి. మూడు రోజులకుముందు అవమానముగా

స్లీవమీాద మరణము పొందిన తన సుతుని ప్రతాపముతో లేచినది చూచి మరియమ్మ చాల సంతోషించెను. మనము గూడ నొకప్పుడు ఉత్థానమగుదుమని తలంచి సంతోషింప వలయును. ఆ పునరుత్థానము భాగ్యమైనదిగ నుండునట్లు మనము మరియమ్మను వేడుకొందము. కడన "ప్రార్థించుదము" అను భాగములో మనమేమని బ్రతిమాలుచున్నాము? నిత్యజీవమైన పరలోకభాగ్యము దయచేయవలయునని బ్రతిమాలుచున్నాము ఈ భాగ్యము ఎవరి సహాయముద్వారా లభింపవలయునని మనము బ్రతిమాలుచున్నాము? దేవమాత సహాయముద్వారా లభింపవలయునని బ్రతిమాలుచున్నాము. ఎవరిద్వారా ఈ ప్రార్థన సర్వేశ్వరునికి సమర్పించుచున్నాము? మనకర్త జేసునాథస్వామి ద్వారా సర్వేశ్వరునికి సమర్పించుచున్నాము. మనము పాపాత్ములము. ఐనను మన సహోదరుడైన జేసునాథస్వామి నిర్మలమైన గొప్పవారైయున్నందువలన వారిద్వారా ప్రార్థించిన యెడల మన ప్రార్థనను సర్వేశ్వరుడు తప్పక ఆలకించెదరు.

## ప్ర యో గ ము.

దేవుడు అర్చ్యశిష్ట కన్యమరియమ్మను చాల హెచ్చించిరి. ఆమెను జన్మపాప రహితోద్భవిగా సృష్టించి, దేవునికి తల్లిగా జేసిరి. అందువలన తిరుసభ ఆమెను గొప్పగా స్తుతించి విశ్వాసులెల్లరు ఆమె శరణు గోరవలయునని సలహా నిచ్చుచున్నది. కనుక మనమును ఆమెను ప్రేమించి, నమ్మకముతో ప్రార్థింపవలయును.

## —* తత్వోపదేశములు. *—

### కంఠపాఠము.

సర్వేశ్వరుని ఆజ్ఞలు,— సర్వేశ్వరుడు ఎవరిద్వారా పదియాజ్ఞల నిచ్చిరి? మోయిజునిద్వారా పదియాజ్ఞల నిచ్చిరి. ఎక్కడ? సీనాయి పర్వతముమీద. సర్వేశ్వరుని ఆజ్ఞలెన్ని? పది. వాటిలో దేవునికి సంబంధించిన వెన్ని? మూడు. (మొదటి మూడు) పొరుగు వారలకు సంబంధించిన వెన్ని? ఏడు. (తక్కిన ఏడు ఆజ్ఞలు) పది ఆజ్ఞలు రెండు ఆజ్ఞలలో అణగియున్నవి. ఆ రెండు ఆజ్ఞలేవి?

సర్వేశ్వరుని ఆజ్ఞల ననుసరించుటకు మనకు అప్పు గలదా? అప్పుగలదు. జేసునాథస్వామి చెప్పినదేమనగా 'నీవు నిత్య జీవములోనికి ప్రవేశింప గోరుదువేని వేదాజ్ఞలను నెరవేర్చుదువు గాక.'

తిరుసభ కట్టడలు:— తిరుసభను స్థాపించిన వారెవరు? జేసునాథస్వామి. తిరుసభకు తలగా జేసునాథస్వామి ఎవరిని నియమించిరి? అర్చ్యశిష్ట రాయప్పను నియమించిరి. అర్చ్యశిష్ట రాయప్పకు బదులుగా నున్నవారెవరు? పరిశుద్ధ పాపుగారు. ప్రస్తుతము మనలను పాలించు పాపుగారెవరు? విశ్వాసుల కొఱకు నియమముల నేర్పఱచుటకు సభాధికారులకు అధికార మిచ్చినవారెవరు? జేసునాథస్వామి. తిరుసభకట్టడల ననుసరించుటకు మనకు అప్పుగలదా? అప్పుకలదు. తిరుసభయొక్క ప్రధాన కట్టడలు ఎన్ని? అవి యేవి?

పాపము అనగా ఏమి? దేవుని ఆజ్ఞ మీరుటయే పాపము. పాప మెన్ని విధములుగా నున్నది? చావైన పాపము, స్వల్పపాపమని రెండు విధములుగానున్నది. చావైన పాపమని యెందుకు పేరువచ్చినది? ఆత్మయొక్క జీవమైన వరప్రసాదమును ఈపాపము పోగొట్టుచున్నది. అందువలన దీనికి చావైన పాపమని పేరువచ్చినది. తలమైన పాపము లెన్ని? అవియేవి?

దేవద్రవ్యానుమానములు— దేవద్రవ్యానుమానములను యెవరు స్థాపించిరి? జేసునాధస్వామి. జేసునాధస్వామి యెందుకు మరణము పొందిరి? మనలను రక్షించుటకు, అనగా మనరక్షణమునకు కావలసినవరప్రసాదములను సంపాదించుటకు జేసు నాధస్వామి మరణము పొందిరి. ఈవరప్రసాదములు మనకు లభించుటకు ప్రధాన మార్గము లేవి? దేవద్రవ్యానుమానములు జన్మపాపమును ఇతర పాపములను బోగొట్టి మనలను సర్వేశ్వరునికిని, తిరుసభకును బిడ్డలనుగాజేయు దేవద్రవ్యానుమానమేది? జ్ఞానస్నానము. సత్యవేదములో మనలను దృఢపఱచుటకు స్థిరుతుసాంక్తమైన సర్వేశ్వరుని జ్ఞానవరములను, అనుగ్రహములను, ఇచ్చు దేవద్రవ్యానుమానమేది? భద్రమైన అభ్యంగము. జ్ఞానస్నానము పొందిన వెనుక కట్టుకొనిన పాపములను మన్నించు దేవద్రవ్యానుమాన మేది? పాపసంకీర్తనము. ఏ దేవద్రవ్యానుమానము ద్వారా జేసునాధస్వామి మన ఆత్మకు భోజనము నొసంగుచున్నారు? దివ్యసత్ప్రసాదనమను దేవద్రవ్యానుమానము ద్వారా, మరణ సమయమునందు కలుగు శోధనల జయించుటకు, శక్తినిచ్చు దేవద్రవ్యాను

# రెండవ భాగము.



## పరితాప బాష్పములు.

### 1. సన్మనస్కులు — పిశాచులు.

మనకు గోచరమగు ఈ ప్రపంచమును సృష్టించుటకు ముందు దేవుడు సన్మనస్కులను సృష్టించెను. వారికి మనవలె శరీరము లేదుగాని, గ్రహించుటకును, ప్రేమించుటకును శక్తి గలదు. వారి జ్ఞానము, శక్తి, మనకంటె చాలగొప్పది. అంతేగాక దేవుడు వారికి పెక్కు విశిష్ట వరము లనుగ్రహించెను. కాని ఏమి సంభవించెను? వారిలో కొందరు గర్వులై దేవునివలె కావలెనని ఆశించిరి. అందుకు దేవుడు కోపించి వారికిగల విశేష దానములను తొలగించి ఆ గర్విష్ఠులను శిక్షించుటకు ఎప్పటికి మండెడు అగ్నియును, ఇంకా వేరనేక బాధలుగల నరకమును సృష్టించి, ఆభయంకర కారాగృహమునకు వారిని త్రోసివేసెను.

సన్మనస్కులను పిశాచులుగ మార్చినదేమి? పాపము. పాపమే వారికి మోక్షము పోగొట్టి నరకమునకు పాత్రులనుగ జేసినది. మన హృదయమునందు పాపము లేనియెడల దేవుడు దానిలో వాసముచేయుదురు. ఈస్థితిలో మరణించినయెడల మన మెక్కడికి పోదుము? మోక్షమునకు పోదుము. ఐనను మనము చావైనపాపము కట్టుకొన్న యెడల వెంటనే దేవుని ఆలయమైన మన హృదయము పిశాచి గృహముగా మారుచున్నది. ఈ స్థితిలో మరణించిన యెడల మనము నరకమునకు పోదుము. దీనినిబట్టి పాపఘోరమెంతయుని మనకు తెలియుచున్నది.

## 2. ఆదితండ్రియైన ఆదాముని పతనము.

ఆదామును సృష్టించి శృంగారవనములో నుంచిన సమ
యమున దేవుడతనికొక ఆజ్ఞ యిచ్చియుండిరి. ఇదిగో! ఆదాము
నిషేధింపబడిన పండుతిని సర్వేశ్వరుని ఆజ్ఞమీఱెను. వెంటనే
దేవుడు కోపించి అపరాధులైన ఆదామును, ఏవమ్మను శృంగార
వనమునుండి వెడలగొట్టిరి. పాపఫలితముగా కరువులు, యుద్ధ
ములు, అంటువ్యాధులు, మరణము మొదలైన కీడులు ఉప్పెన
వలె లోకమును ముంచివైచెను. చూచితిరా! పాపముయొక్క
భయంకర ఫలితము! లోకారంభము మొదలుకొని మరణించిన
వారల కపాలములన్నియు, ఒక స్థలములో ప్రోగుచేసిన యెడల
ఎంత రాసి యేర్పడునో ఊహించుకొనుడు. ఈ జనసమూహ
మంతయు మరణించుటకు ఆదాము కట్టుకొనిన ఆదియొక్క
పాపమే కారణమైయున్నది. ఈ పాపము మానవ వర్గమునకు
మోక్షపువాకిలి మూసివేసెను. ఈ పాపమును పరిహరించుటకై
దైవపుత్రుడు సిలువమీద వ్రేలాడి మరణము పొందిరి. పాప
కీడు ఎంత గొప్పదని దీనినుండి గ్రహించి, దానిని పరిత్యజింప
ప్రయాసపడవలయును.

## 3. జలప్రళయము.

నోయునికాలములో లోకమంతయు పాపము విస్తరించి
యుండెను. అందువలన జలప్రళయముచే లోకమును శిక్షిం
చుటకు దేవుడు నిశ్చయించుకొనిరి. దేవుని ఆజ్ఞ ప్రకారము
నలుబది రేయింబవళ్లు గొప్పవాన కురిసెను. గృహములు

మాత్రమే కాదు గొప్ప పర్వతములు గూడ నీటిలో మునిగి పోయెను. మనుష్యులు, పశువులు అన్నియు చనిపోయెను. కానీ నీతిమంతుడైన నోయాదు దేవుని ఆజ్ఞప్రకారము ఒక నావను నిర్మించి యుండెను. దానిలో నెక్కిన నోయాదును, ఆయన కుటుంబమును, కొన్ని జంతువులు, పక్షులు మాత్రము రక్షింపబడెను. ఈ విధముగా జలప్రళయము వలన దేవుడు లోకమును పాపమాలిన్యమునుండి కడిగి పవిత్రము జేసిరి. ఐతే ప్రస్తుతపరిస్థితి ఏమి? ఈశతాబ్దములో రెండు మహాయుద్ధములు జరిగినవి. రక్తము ఏరులై ప్రవహించినది. ఇదంతయు పాప ఫలితమే. పాపము దేవునికి ఎంత ద్వేషము రప్పించునని యెరుగవలయును.

## 4. అగ్ని వర్షము.

అబ్రహాముని కాలములో జరిగిన సంఘటన మొకటి చెప్పెదము. ఆ కాలములో సొదొమ, గొమొఱ్ఱ యను రెండు పట్టణములు సకల సంపదలచే తులదూగుచుండెను. అయితే పట్టణవాసులు అశుద్ధ పాపములో మునిగి తేలుచుండిరి అందు వలన వారు దైవకోపమునకు పాత్రులైరి. ఆ నిర్భాగ్యులపై అగ్నివర్షము కురియు, పట్టణవాసులును, వారి పశువులును, ఇళ్లు గోపురములన్నియు కాలి భస్మమయ్యెను. ఈ విధముగా దేవుడు, తమకు పాపముపైగల ద్వేషము ప్రకటించిరి.

ఇక్కడ మన మొక విషయము ఆలోచించవలయును. గత ప్రపంచ మహాయుద్ధమునందు జరిగిన దేమి? శత్రు విమా

నములు, వేలకొలది బాంబులను కురిపించిన దెక్కడ? జనులు గుంపులు గుంపులుగా నివసించు పట్టణములవైననేగదా? ఫిరం గులు ఎంతమంది వీరసైనికులను తన పొట్టను పెట్టుకొనలేదు? ఒకే ఒక అటంబాంబు హీరోషిమా నగరములో చేసిన భయం కర నాశనము ఎంతయని తలంచినప్పుడు మన గుండెలు తల్లడిల్లు చున్నవి. నాస్తికత, అధర్మము మొదలైన లెక్కలేని మన పాప ములే ఈ కరువులకు కారణములని గ్రహించుట అవసరము.

## 5. దుడుకు చిన్నవాడు.

దేవుడు పాపము నెంత తీవ్రముగా ద్వేషించుచున్నా డని పెక్కు సంగతులద్వారా మనము గ్రహించితిమి. అదే విధముగా మనము గ్రహింపవలసిన మరియొక సత్యము గలదు. అదేమనగా దేవుడు పాపాత్ముని ప్రేమించి, వాని పరితాపము కొరకై యెదురుచూచు చున్నాడనియే. ఈ సత్యము మనము సరిగా గ్రహించుటకు జేసువు చెప్పిన [illegible] సామెతను వివరించెదము.

ఒక తండ్రికి ఇరువురు కుమారు లుండిరి. వారిలో చిన్నవాడు దుష్టుల సాంగత్యము వలన దుర్మార్గుడై యుండెను. వాడు తండ్రి దగ్గరనుండి పితృధనము పంచుకొని పరదేశమునకు పోయెను. అక్కడ కొంతకాలములోనే తన దగ్గరనున్న డబ్బు నంతయు సెలవు చేసెను. భోజనము లేక పస్తులుండవలసిన పరిస్థితి యేర్పడినది. మిత్రులు వానిని చేయి విడచిరి. ఆకలికి తట్టుకొనలేక ఒక యజమానుని క్రింద పనికి చేరుకొనెను.

ఆ యజమానుడు పరమదుర్మార్గుడు. వాడు పందులు మేపుటకు నియమింపబడెను. చాలిన భోజనముగాని, కావలసిన వస్త్రము గాని వానికి లభింపలేదు. ఈలాగు చినిగిన గుడ్డలు ధరించి, కాలుచున్న కడుపుతో పందులమధ్య రేయింబవళ్లు నివసింప వలసివచ్చెను. చూచితిరా! గర్వఫలిత మెంత ఘోరమైనదో!

ఈ నిర్భాగ్య స్థితిలో వాడు తన తండ్రిని, తాను నివసించిన భవనమును, తలంచుకొన్నంతనే, అప్రియత్నముగ వానికన్నుల నీరు కారసాగెను. అంతట వాడులేచి తన తండ్రి దగ్గరకు వెళ్లెను. రేయింబవళ్లు కుమారునిరాక కెదురు చూచు చున్న వానితండ్రి కుమారుని యెదుర్కొనుటకు పరుగెత్తి వచ్చెను. వాడు తనతప్పిదమును మన్నింపుమని తండ్రిని మనవి చేసుకొనెను. తండ్రి వానిని ఆలింగనము చేసుకొని ముద్దిడి సంతోషించెను. అంతేగాక వానికి స్నానము చేయించి, మంచి బట్టలు తొడిగించి, పాదములకు చెప్పులను, వ్రేలికి ఉంగరమును ధరింపజేయుడని సేవకుల కాజ్ఞాపించెను. అంతట పెద్ద విందుచేసి అందరును ఆనందించిరి.

దుడుకు చిన్నవాని తండ్రి దేవుని సూచించుచున్నాడు, దుడుకు చిన్నవాడు మనలో నొక్కొక్కరికి సాదృశ్యముగా నున్నాడు. మనపాపము లెన్నియైనను, యెంత పెద్దవైనను నిరాశపడనక్కరలేదు. వాటి కొఱకు మనస్తాపపడి పాపసంకీర్తనము చేసిన యెడల, దేవుడవి యన్నియు మన్నించెదరు.

## 6. మంచి సమార్యస్తుడు.

బాటసారి యొకడు జెరుసలేము నుండి జెరికో యూరికి పోవుచుండెను. దారిలో దొంగలు మీద పడిరి. వాని దగ్గర నున్న దంతయు లాగుకొన్న తరువాత గాయపఱచి వదలి పోయిరి. చాలమంది ఆమార్గమున పోయిరిగాని యెవరును కని కరించి వానికి సహాయము చేయలేదు. అప్పుడు ఒక సమార్య స్తుడు ఆమార్గమున పోవుచుండెను. వాడు స్పృహదప్పి పడియున్న బాటసారిని గాంచి, దయతో వానిని సమీపించి, గాయములు కడిగి ద్రాక్షరసమును, నూనెయును పోసి కట్టుకట్టెను. తన వాహనముపైనెక్కించుకొని, దగ్గరి సత్రమునకు తీసుకొనిపోయి అక్కడ వానిని పోషించి, గుణపరచుటకు యేర్పాటు చేసెను.

ఇది జేసునాధస్వామి చెప్పిన సామెత. ఈ మంచి సమార్యస్తుడు జేసునాధస్వామిని పోలియున్నాడు. బాటసారి మోక్షమునకు యాత్రజేయు మనకు సాదృశ్యము. నరక శతృవు మనల నాక్రమించి జ్ఞానమేలులు లేకుండ గాయపఱ చెను. ఈ విధముగా గాయపఱుపబడిన మనలను, కనికరించి కాపాడుటకై దేవపుత్రుడైన జేసునాధస్వామి మోక్షమునుండి దిగివచ్చిరి. మన కొరకు వారి తిరురక్తము తుది బిందువు వరకు చిందిరి. అంతేగాక పాపసంకీర్తనముద్వారా తమ రక్త మనెడి నూనెయు, ద్రాక్షరసమును మనగాయములపై పోసి బాగుపఱచుటకు తన గురువులకు ఆజ్ఞ యిచ్చియున్నారు. మనము మన పాపముల కొఱకు మనస్తాపపడి, తనను సమీ

పించుటకును, పాపవిమోచనమిచ్చి మనలను అనుగ్రహించు టకును వారెంత అభిలషించుచున్నారని దీని నుండి గ్రహింప వచ్చును.

## 7. మంచి గొల్లవాడు.

'నేను మంచి గొల్లవాడను. మంచి గొల్లవాడు తన గొఱ్ఱెల కొరకు ప్రాణము విడచును' అని జేసువు వక్కాణించి యున్నారు. క్రింది సామెత దేవునికి పాపాత్ములపైగల దయను చూపించుటకు జేసువు చెప్పియున్నారు.

నూరు గొఱ్ఱెలుగల ఒక గొల్లవాడు వాని గొఱ్ఱెలలో ఒక గొఱ్ఱె కనబడకపోయిన యెడల ఊరకుండునా? ఉండడు. వాడు కనబడక పోయిన గొఱ్ఱెను వెదుక బయలు దేరును. రాళ్ళను, ముళ్ళను లెక్కింపక, దానిని వెదకును. అది అగు పించిన పక్షమున, తన శ్రమను లెక్కింపక, దానిని తన భుజ ముపై మోసుకొని మందయందు జేర్చును. అంతేగాక తప్పి పోయిన గొఱ్ఱె అగపడినందుకు వాడు పొరుగు వారలతో గలసి సంతోషించును.

పాపులు నాశనమైపోక మంచి దారికి తిరిగిన జేసునాథ స్వామికి కలుగు సంతోషమే యిక్కడ మనము చూచు చున్నాము. జేసునాథస్వామి మనలను యేంతో ప్రేమించిరి. ఏ గొల్లవాడు తన గొర్రెల కొరకు ప్రాణము నిచ్చెను? తన మాంసము భోజనముగా తన రక్తము పానీయముగా నిచ్చువారెవరు? ఎవరును యివ్వరు. ఐతే జేసువు అట్లుకాదు. పాపాత్ముడు పరితపించుటకు వారికిగల కోరిక ఎంతయని చెప్ప

గలము! ఒక పాపాత్ముడు పరితపించునపుడు మోక్షవాసులం దరు తనతో సంతోషించుదురని వారు చెప్పియున్నారుగదా.

### 8. స్లీవమీద కొట్టబడిన జేసువు.

"ఇదిగో! సర్వేశ్వరునియొక్క గొఱ్ఱెపిల్ల!" అనికదా స్నాపక అరుళప్ప జేసువును జూదులకు పరిచయము చేసినది. వాస్తవముగ వారులోకముయొక్క పాపములను పరిహరించెడు దివ్యగొఱ్ఱెపిల్లయే. ఈ పరమార్థమును ఇజయాసు దీర్ఘదర్శ నమునుండి మనము గ్రహింపవచ్చును. వారు చెప్పిన దేమన "మన తప్పిదములకుగా వారు గాయపరుపబడిరి. మన పాపము లకుగా నలుగ గొట్టబడిరి". ఈ దీర్ఘదర్శనము యే విధముగా నెరవేరినదని గ్రహింపవలయునన్న, మన చూపులు కపాల పర్వతముపై బరపిన చాలును.

స్లీవమీద కొట్టబడిన జేసువు:— వారి శిరస్సున కొట్టబడియున్నది పదనగు ముండ్లకిరీటము. నలుగకొట్టబడిన వారి తిరుశరీరము రక్తసిక్తమై మనకగుపడుచున్నది. కరచరణ ములు ముదుగైన ఇనుపచీలలతో స్లీవకుచేర్చి కొట్టబడియున్నవి ఇదిగో సర్వేశ్వరునియొక్క గొఱ్ఱెపిల్ల - అవమాన సాధనమైన స్లీవమీద వ్రేలాడు దౌర్భాగ్య స్థితిలో, అంతేగాదు, ఇరువురి దొంగల మధ్యన పెద్దదొంగవలె, ఉగ్రమైన బాధలను సహించిరి. మన పాపములకు పరిహారము చేయుటకుగదా జేసునాథస్వామి ఇంతకఠినమైన పాట్లనుభవించినది. దీనినుండి పాపమెంత భయంకరమైనదని గ్రహింపవలయును. ఇంకొక

సంగతి మనకు జ్ఞాపకమునకు తెచ్చుకొనవలయును. అది జేసు నాధునికి మన పైగల ప్రేమ. ఈ నాధుడు 'నేను పాపాత్ములను పిలువ వచ్చితినిగాని నీతిమంతులను గాదు' అని వక్కాణించి యున్నారని మన మెరుగవలయును. ఇట్లు పాపాత్ములను వెతకివచ్చి వారల కొఱకు నీక కష్టము లనుభవించిన జేసువు, పరితపించి తన దగ్గఱకు పరుగెత్తి వచ్చు పాపాత్ములను త్రోసివేయుడురా?

## 9. అర్చ్య. రాయప్పగారి పరితాపము.

అపోస్తులైన రాయప్ప జేసునాధస్వామిని చాల ప్రేమించెను. కడరా భోజనసమయమున జేసువుతో సహా మరణించుటకు సిద్ధముగాయున్నానని చెప్పియుండెను. ఐతే జరిగిన దేమి? కైపాసుని యింటిలో నొక పనికత్తె "నీవు గలిలేయస్తుడవు కావా?" యని ప్రశ్నించినపుడు రాయప్ప భయపడి జేసువును ఎరుగనని బొంకెను. ఇట్లు మూడు మారులు జరిగెను. కడన జేసువును ఎఱుగనని ప్రమాణముచేసి చెప్పెను. వెంటనే కోడి కూసెను. "కోడికూయకమునుపే నీవు నన్నెరుగనని ముమ్మారు బొంకుదువని" జేసువు పలికిన మాటను రాయప్ప జ్ఞాపకము చేసుకొనెను. వెంటనే వెలుపలకు పోయి రోదన మేడ్పులు యేడ్చెను. జేసువు రాయప్పను మన్నించి అనుగ్రహించిరి.

పాపము చేయుచున్నప్పుడు మనము జేసువును నిషేధించి, అవమానపఱచుచున్నామని యెఱుగవలయును. అప్పుడు

రాతిస్థంబమునకు కట్టికొట్టబడి దేహమంతయు గాయపరుపబడి, రక్తములో మునిగిన జేసువు దుఃఖముతో మనలను చూచుచున్నారని జ్ఞాపకము చేసుకొనవలయును. ఇంత ప్రేమగల జేసునాథునికి, తిరిగి పాపము కట్టుకొని ద్రోహము చేయకూడదు. మనము చేసిన తప్పుల కొరకు, అర్చ్యశిష్ట రాయప్పవలె దుఃఖించి యేడ్వవలయును. ఇకమీద పాపము చేయనని ప్రతిజ్ఞచేసి, చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుటకు కావలసిన అనుగ్రహములను వినయముతో బ్రతిమాలవలయును.

## 10. పరితపించిన పాపిని.

ఒకరోజు జేసువొక పరిజేయుని గృహములో భోజనమునకు కూర్చుండి యుండిరి. పట్టణములోయుండు ఒక పాపాత్మురాలీ సంగతి తెలిసికొనెను. తన పాదముల పైగల పరితాపము ఆమె ప్రత్యక్షముగా చూప తీర్మానించుకొనెను, అందువలన ఆమె విలువగల పరిమళ తైలము నెత్తుకొని భోజనశాల ప్రవేశించెను. జేసువుయొక్క తిరుపాదములను ఆమె కన్నీటితో కడిగి, తలవెండ్రుకలతో తుడిచి ముద్దుకొని సుగంధ తైలము వారి తలపై కుమ్మరించెను. ఇట్లు పాపమునకు ఉపయోగించుచున్న తైలము ఆమె దైవ యూడిగమున కర్పించెను. జేసువు ధైర్యముగల ఆమె మనస్తాప ప్రకటన చూచి చాల సంతోషించిరి. భోజనపంక్తి యందుండు వారితో నిట్లు చెప్పిరి. "ఈమె బహుగా ప్రేమించెను, గనుక విస్తార పాపములు మన్నింపబడెను", తర్వాత జేసువు ఆమెను దృష్టించి "నీ పాపములు నీకు మన్నింపబడినవి" అని చెప్పి ఆమెను ఓదార్చిరి.

దీనినుండి పాపవిమోచనమునకు దైవప్రేమ యెంత శక్తిగల సాధనమని గ్రహింపవచ్చును. "ప్రేమించినందుకు పాపములు మన్నింపబడెను" అనికదా జేసువు వక్కాణించినది. పాపమువలన సకల మేలుల స్వరూపియైన దేవునికి ద్రోహము చేసి, జేసునాథుని పాటులకు కారణమైతినని యెంచి పరితాప పడుట దైవప్రేమవలననే. ఇదే ఉత్తమ మనస్తాపము. దైవ భయము నుండి దాసత్వ మనస్తాపము పుట్టును. పాపమువలన మోక్షము పోగొట్టుకొని, నరకమునకు పాత్రులమైతిమని పరి తపించుటయే దాసత్వ మనస్తాపము. పాపసంకీర్తనము చేయు టకు దాసత్వమనస్తాపము చాలును. కానీ ఉత్తమ మనస్తాప పడుటకు ప్రయాసపడుట చాల మంచిది.

## 11. మంచిదొంగ.

జేసునాథుని కిరువైపుల, ఇరువురు దొంగలు కొట్టబడి యుండిరి. వారిలో ఎడమప్రక్కన ఉండినవాడు దుష్టజూదులతో గలసి జేసువును దూషించెను. ఇదివిని కుడిప్రక్కన ఉన్న దొంగ తన తోడుదొంగను చీవాట్లుపెట్టెను. అంతేగాక వాడు తన తప్పిదములను, జేసువుయొక్క నిష్కళంకత్వమును బహిరం గముగా నొప్పుకొనెను. వానిమాటలు ఎంత వినయముగలవో చూడుడు. "వాస్తవముగా మనకిది న్యాయమైనదే. ఇతడు ఏ దుష్క్రియను చేయలేదు. ఏలినవారా! తమరు మీ రాజ్యములో చేరినపుడు నన్ను జ్ఞాపకము చేసికొనుడు" అని బ్రతిమాలెను. "నేడే నీవు నాతో పరమానందమున నుందువని, నేను నీతో నిజముగా చెప్పుచున్నాను" అని జేసువు ప్రత్యుత్తరమిచ్చిరి.

ఈ మంచి దొంగవలె మనమును శిక్షకు పాత్రులమని ఒప్పుకొనవలయును. మరియు పాపములకొరకు మనఃపూర్వకముగా దుఃఖించి వాటిని పాపసంకీర్తనములో బయలుపరచవలయును. అట్లుచేసినయెడల సర్వేశ్వరుడు మనకును యేసుదయ అనుగ్రహింతురు. మనము కట్టుకొనిన పాపము లెన్నియైనను, ఎంతగొప్పవైనను, వాటినన్నిటిని క్షమించెదరు.

## 12. పది మంది కుష్ఠరోగులు.

ఒకరోజు పదిమంది కుష్ఠరోగులు యేసువును సమీపించి "మామీద దయగా నుండండి" యని బ్రతిమాలిరి. "మీరు పోయి మిమ్ము ఆచార్యులకు నగపరచుకొను" డని యేసువు వారల కాజ్ఞాపించిరి. వారు పోవుచుండగా శుద్ధులైరి; ఐన వారలలో సమార్యస్తుడొకడు మాత్రమే, కృతజ్ఞత స్తోత్రములు చెల్లించుటకు తిరిగి వచ్చెను. "పదుగురకు స్వస్థత కాలేదా? ఆ తొమ్మండ్రుగు రెక్కడ?" అని యేసువు వారి కృతఘ్నతకు చీవాట్లు పెట్టిరి.

తమ్ము శుద్ధిపరచవలయునని బ్రతిమాలిన కుష్ఠురోగులతో మిమ్ము ఆచార్యుల కగుపరచుకొనుడని కదా యేసువాజ్ఞాపించినది. పాపము ఆత్మీయ కుష్ఠురోగము. ఈ వ్యాధినుండి స్వస్థత నొందుటకుగల మార్గమే పాపసంకీర్తనము. మన పాపములను గురువు నెదుట బయలుపరచి, విమోచనము పొందవలయుననియే యేసునాథుని యుద్దేశము. వారు ఆచార్యులను సమీపించుటకు ముందే స్వస్థతనొందిరి గదా? అట్లే పాపసంకీర్తనమునకు ముందు ఉత్తమమనస్తాప పడినయెడల పాప

విమోచనము లభించును. కానీ అట్లు మన్నింపబడిన పాపములు కూడ తప్పక పాపసంకీర్తనముతో బయలు పరచవలయును.

సూచన:— ఏదైన చావైన పాపములో పడిన వెంటనే ఉత్తమ మనస్తాపముద్వారా దానినుండి విమోచనము పొందుటకు ప్రియాసపడవలయును. ఈ అలవాటు గలవారు అకస్మాత్తుగా వచ్చు మరణమునకు భయపడ నవసరము లేదు.

పదుగురు స్వస్థతపొందిరి. అయితే తొమ్మిదిమంది కృతజ్ఞత చూపనందుకు యేసువు అసంతృప్తి పొందిరి. అందువలన పాపసంకీర్తనానంతరము పాపవ్యాధినుండి మనలను గుణపరచిన దేవునికి కృతజ్ఞత చూపుటకు మరువరాదు.

## 13. నా మా ను డు.

నామానుడు సిరియా రాజుయొక్క సైన్యాధిపతి. అతడు కఠినమైన కుష్ఠుచే బాధపడుచుండెను. ఈ వ్యాధినుండి స్వస్థత నొందుట కా సేనాధిపతి ఎలిజేయుడను దీర్ఘదర్శియొద్దకు పోయెను. "నీవు ఏడుమారులు జోర్దాను నదిలో స్నానము చేయుదువేని గుణమగు"నని దీర్ఘదర్శి అతనికి చెప్పిపంపెను. ఈ మాటలు నామానునకి సరిపడలేదు. "దమాస్కను ప్రాంత్యమున జోర్దాను నదికంటె మంచినదులు లేవా?" అని నామానుడు కోపముతో పలికెను. అప్పుడు సేవకులు తమ అధిపతితో యుక్తిగా నిట్లు చెప్పిరి. "యజమానుడా! దీర్ఘదర్శి ఏదైన కష్టమైనపని కల్పించియున్నయెడల నీవు తప్పక చేసియుందువు. అయితే పోయి స్నానముచేయుమని మాత్రము ఆజ్ఞాపించినపుడు చేయకుండుట పాడియా?" ఇట్లు సేవకులు తొందర పెట్టుట

వలన నామానుడు విధిలేక జోర్దానునదిలో స్నానము చేసెను. తత్క్షణమే కుష్ఠురోగము నామానుని విడిచిపోయెను.

సేవకుల ఈ యుక్తివాదము పాపసంకీర్తన విషయమునందుకూడ మిక్కిలి అర్థముగలదిగ నున్నది. ఎట్లన మానవుడు దేవునికి పాపముకన్న నెక్కువ ద్రోహము చేయజాలడు. దాని విమోచనమునకు జీవితమంతయు తపస్సు చేయవలయునని, ఆజ్ఞాపించినయెడల అట్లు చేయుటకు మనము అప్పుగలవారలమై యున్నాము. అయితే దివ్యరక్షకుడు కోరునదేమి? పాపములకు మనస్తాపపడి, గురువుల యెదుట బయలుపరచవలయునని, మాత్రము కోరుచున్నారు. ఈ దేవద్రవ్యానుమానము స్థాపించినందుకు మనము సర్వేశ్వరునికి కృతజ్ఞత గలవారమై యుండవలయును.

## 14. పాపసంకీర్తనము - ఒక సమాధానమూలిక.

ధనవంతుడైన హాలండు దేశీయుడొకడు ఒక ఘనమైన పాపములో పడెను. పిశాచి అతనికి కలిగించిన సిగ్గువలన, ఆ పాపము చెప్పి పాపసంకీర్తనము చేయుటకంటె మరణించుట మేలని తీర్మానించుకొనెను. మనస్సాక్షి వానిని చాల పీడించుచుండెను. ఇట్లుండగా మరచిపోయిన పాపములకు మన్నింపు లభించుటకు పాపసంకీర్తనము అవసరము లేదని యొక ప్రసంగము వినెను. ఆరోజు మొదలుకొని దేశసంచారము, తదితర మార్గములద్వారా, ఆ భయంకర పాపము మరచిపోవుటకు ప్రయత్నించెను. ఐనను ఆ యుద్యమము నిష్ఫలమాయెను.

తుదకు తన నిర్భాగ్యజీవితము అంతము చేయుటకు తీర్మానించు కొనెను. ఐతే దేవుని అనుగ్రహము! ఆ నీచప్రవృత్తి చేయబోవు చుండగా తెలిసినవొక గురువును చూచు భాగ్యము గలిగెను. ఇరువురును మాటలాడుచుండగా గురువు పాపసంకీర్తనమును గురించి ఏదో చెప్పెను. వెంటనే ఆధనవంతుడు తాను చేసిన పాపము పాపసంకీర్తనములో చెప్పుటకు ఇష్టములేక ఆత్మ హత్య చేసుకొనుటకు తీర్మానించుకొంటినని చెప్పెను.

గురువు పరిస్థితియొక్క ఘనతను గ్రహించి, దేవుని సహా యము బ్రతిమాలి మాటలాడసాగిరి. గురువు సంభాషణ మధ్యన, ఆధనవంతుని పరిస్థితులలోగల యొకడు చేయగల అపకీర్తికరమైన పెక్కు పాపములను చెప్పిరి. వాటిలో నొక పాపమును వినిన వెంటనే ఆపాపమే నన్ను కష్టపెట్టుచున్నదని ధనవంతుడు చెప్పెను. 'పాపము చెప్పితివిగదా. అందువలన మోకాళ్ళమీదనుండి అది ఒప్పుకొని పాపవిమోచనము పొందుము' అని గురువు ఉపదేశించిరి. అప్పుడా ధనవంతుడు చిన్నబాలునివలె మోకాళ్ళమీదయుండి మహామనస్తాపముతో పాపసంకీర్తనము చేసెను. పిదప అతడు చెప్పిన దేమన 'పాప సంకీర్తనమా! నాకు నీవెంత సమాధానము నొసంగితివి'.

వాస్తవముగా పాపసంకీర్తనము హృదయ సమాధా నము నొసంగు ఔషధము. తఱచుగా పాపసంకీర్తనము చేయు నట్లు మనల ప్రేరేపించుటకు ఈ యొక్క మేలు చాలదా?

## 15. ఒక భయంకర సంఘటనము.

ఫ్లోరెన్సు రాజ్యములో పదునెనిమిది సంవత్సరముల ప్రాయముగల యొక యువతి ఘనమైన పాపములో బడు దౌర్భాగ్యము సంభవించెను. పాపము చేసిన వెంటనే గొప్ప సిగ్గు ఆమెయందు పిశాచి కలుగజేసెను. కానీ భయంకరము! ఆపాపము దాచిపెట్టి పాపసంకీర్తనము చేసి దివ్యసత్ప్రసాదమును లోగొనెను. తరువాత అది ఒక అలవాటాయెను. మనస్సాక్షి ఆమెను చాల బాధించుచుండెను. కొంతమటుకు ఓదార్పు లభించునేమోయని కఠినమైన తపస్సు నారంభించెను. మరణ మంచమునకూడ ఆమె ఆపాపమును పాపసంకీర్తనమున బయలు పరచలేదు. ఆమె అర్చ్యశిష్టురాలుగ మరణించెనని అందరును తలంచిరి. కొన్నిరోజులైన తర్వాత కొందరు కన్యకలు ప్రార్థించుటకు ఆమె సమాధిని సమీపించినప్పుడు, భూతాకృతిలో ఆమె వారల కగుపడి "ప్రియముగల సోదరీమణులారా! నా కొరకు వేడుకొన నవసరములేదు. నేను నశించితి"నని యేడ్చెను. వారు చాల భయపడి "ఇంతభక్తిగ జీవించిన పిదప గూడనా?" యని అడిగిరి. అప్పుడా భయంకర భూతము "నేను వయస్సులో చేసిన ఒక పాపము దాచిపెట్టి దొంగపాపసంకీర్తనము చేయుచుంటిని" అని చెప్పి అదృశ్యమయ్యెను.

ఇట్టి విపరీతము కలుగకుండ మనము చాల జాగ్రత్తగా యుండవలయును. దొంగ పాపసంకీర్తనము ఎప్పుడును చేయరాదు. మనపేరు పోవునని తలంచుట పిశాచి తంత్రమే. పాపములు ఎంతగొప్పవైనను, ఎన్నియైనను వాటినన్నిటిని కచ్చి

తముగ బయలు పరచినది చూచినపుడు పాపసంకీర్తనము విను గురువునకు వానిపై గౌరవము, ప్రేమ యెక్కువగును. దీని కొక ఉదాహరణము చెప్పెదము.

## 16. అర్చ్యశిష్ట ఫ్రాంసిస్ సాలెస్‌గారి సాక్ష్యము.

ఒకానొకప్పు డొక పెద్దపాపి, అర్చ్యశిష్ట ఫ్రాంసిస్ సాలెస్‌గారి దగ్గర గొప్ప పరితాపముతో పాపసంకీర్తనము చేసెను. తర్వాత 'నన్నుగూర్చి యిపుడు మీ అభిప్రాయమేమి?' అని ప్రశ్నించెను. పాపములన్నిటిని నిష్కపటముగను, అర్చ్యశిష్టులకుగల అనుతాపముతోను పాపసంకీర్తనము చేసినందుకు ఆ అర్చ్యశిష్టులు చాల సంతోషించుచుండిరి. అందువలన యే సంకోచము లేక వెంటనే 'నీవు ఒక అర్చ్యశిష్టుడవు అని తలంచుచున్నా'వని జవాబిచ్చిరి.

పాపములన్నిటిని నిష్కపటముగ నెరుక జేయుటవలన మన పేరు యెప్పుడును చెడిపోదు. పాపములను నిష్కపటముగ జెప్పనియెడల గురువు మన నిష్కాపట్యమును శంకింపవచ్చును.

## 17. అర్చ్యశిష్ట జాన్ నెప్‌మ్యూసన్.

పదునాల్గవ శతాబ్దములో వెంజజ్జలావుస్ చక్రవర్తి బొహీమియా రాజ్యము నేలుచుండెను. పుణ్యమునను, శాస్త్రజ్ఞానమునను ప్రసిద్ధి పొందిన అర్చ్యశిష్ట జాన్‌గారు చక్రవర్తిని యొక్క ఆత్మీయ గురువుగ నియమింపబడిరి. ఇట్లుండగా చక్రవర్తికి తన భార్యపై కొన్ని అనుమానములు

కలిగెను. యదార్థము గ్రహింపవలయునని, తనభార్యకు ఆత్మ గురువులైన అర్చ్యశిష్ట జాన్‌గారిని ప్రశ్నించి తెలుసుకొనుటకు చక్రవర్తి తీర్మానించుకొనెను.

అంతట చక్రవర్తి అర్చ్యశిష్ట జాన్‌గారిని సమీపించి తన భార్యయొక్క పాపసంకీర్తన రహస్యముల దెలుపుమని యడిగెను. దానికి గొప్ప బహుమానము గూడ వాగ్దానము జేసెను. అర్చ్యశిష్ట జాన్‌గారందుకు సమ్మతింపలేదు. అందుపై చక్రవర్తి కోపించి వారిని కారాగృహములో వేయుట కాజ్ఞాపించెను. రోజులు, వారములు గడచినను, ప్రయోజనములేనిది చూచిన చక్రవర్తి వారిని విడిపించెను. తదుపరి చక్రవర్తి నయ, భయము లుపయోగించెను. అప్పటికిని తన ప్రయత్నము విఫలమైనది చూచి చక్రవర్తి కుపితుడయ్యెను. ప్రజలవలని భయముచే వారిని రాత్రిసమయమున నదిలో వేసి చంపుటకు ఆజ్ఞాపించెను. క్రీ. శ. 1393 వ సంవత్సరమున జాన్‌గారు వేదసాక్షిగా మరణించిరి.

ప్రజలెరుగకుండుటకై రాత్రియందు వారిని నదిలో వైచిరిగదా! కానీ ఆ పావన శరీరము నదిలో కొట్టుకపోక, నీటిపై తేలియాడుచుండెను. గొప్ప ప్రకాశము ఆశరీరమును చుట్టుకొని యుండెను. ఇట్లు ప్రజలు జరిగిన యదార్థమును గ్రహించి, ఆ పవిత్ర శరీరమును పూజ్యముగా సమాధి చేసిరి. ఆ పవిత్ర శరీరమువలన పెక్కు అద్భుతములు సంభవించెను. అంతేగాక క్రీ. శ. 1719 వ సంవత్సరమున ఈ అర్చ్యశిష్టుని సమాధి తెరచిచూడ శరీరమంత కుళ్లిపోయినను, పాపసంకీర్తన

రహస్యమును కాపాడుటకు మానము వహించిన నాలుక మాత్రము చెడక ఎప్పటివలె యుండెను.

మరణశిక్ష వచ్చినను గురువులు పాపసంకీర్తన రహస్యము బయలుపెట్టరని దీనినుండి గ్రహింపవలయును.

## 18. ఒక హత్య.

రష్యాదేశమునందు ఓరటోవు అను స్థలములో క్రీ. శ. 1853 సంవత్సరమున ఒక భయంకర హత్య జరిగెను. హంతకుడు దగ్గరనున్న గుడికిపోయి పాపసంకీర్తనము చేసి పారిపోయెను.

అధికారులు వెదకుచుండగా పాపసంకీర్తనము వినిన గురువుమీద అనుమానపడిరి. వారిని చెరలోవేసి విచారించిరి, నేరస్తుడని ఋజువు చేయుటకు అనేక దొంగ సాక్ష్యములను వారిపై మోపిరి. ఫలితముగా జీవితాంత్య కారాగృహ శిక్ష విధింపబడి సైబీరియా యందుండు భయంకర నిర్జనస్థలమునకు పంపబడిరి. ఒక్క మాటవలన వారికష్టము లన్నియు తప్పించుకొన గలిగియుండిరి. కాని వారట్లు చేయలేదు. అనంతరము 25 ఏండ్ల తరువాత ఒక ముసలివాడు మరణశయ్యపై నుండి, చుట్టుపక్కలవారిని పిలిచి 25 ఏండ్ల క్రితం తానుచేసిన హత్యను సాక్ష్యముతో ఋజువు చేసెను. వెంటనే సర్కారువారు సైబీరియాలోనున్న గురువును విడిచిపెట్టవలయునని ఆజ్ఞాపించిరి. సర్కారువారి ఆజ్ఞ సైబీరియా చేరకమునుపే ఆ గురువైనవారు వేదసాక్షిగా మరణించిరి.

## 19. మతత్యాగియైన గురువు.

ఈ సంఘటన వెరిరెవరెండ్ క్యానన్ హోమ్‌చే విరచితమైన " THE CATECHIST " అను గ్రంథమునుండి గ్రహింపబడి నది. ఫ్రెంచి విప్లవకాలములో మతత్యాగియైన ఒక గురువు విప్లవకారులచే పట్టబడెను. ఆగురువునుండి పాపసంకీర్తనరహా స్యములు బయలు పరచవలయునను పైశాచికబుద్ధి వారలకు పుట్టెను. అందుకొరకు ఆ గురువును మద్యము నెక్కువగా త్రాగించిరి. ఐతే పాపసంకీర్తన రహస్యమును గురించి మాటా డినపుడు వారి భావము మారెను. వారొక కత్తి నెత్తుకొని తన హృదయమున గురిపెట్టి చెప్పినదేమన "కావలసినయెడల మీరీ కత్తితో నిక్కడ పొడువవచ్చును. కానీ పాపసంకీర్తన రహస్య ములలో ఒకటియైనను మీకు దొరుకదు."

దీనినుండి దేవుడే పాపసంకీర్తన రహస్యము భద్రముగా కాపాడుచున్నాడని గ్రహింపవచ్చును గదా?



జానకీ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు.

## మీరు ఈ పుస్తకములు చదివినారా?

| | | |
|---|---|---|
| 1. | మతతత్వబోధిని I. | 0-30 న. పై. |
| 2. | మతతత్వబోధిని II. | 0-30 ,, |
| 3. | మతతత్వబోధిని III. | 0-30 ,, |
| 4. | బాలమిత్రము | 0-25 ,, |
| 5. | దైవపిలుపు | 1-00 ,, |
| 6. | చిన్న పుష్పము | 0-12 ,, |
| 7. | నీ పొరుగువాడు | 0-19 ,, |
| 8. | దివ్యబలి | 0-06 ,, |
| 9. | క్రీస్తురాజు | 0-25 ,, |
| 10. | జేసువు నిన్ను పిలుచుచున్నాడు. | 0-25 ,, |

దొరకు చోటు: —

Fr. JOSEPH THAZHATH,
*Catholic Church,*
**PRODDATUR P. O.**
(*Cuddapah Dt.*)